# ఆశీస్సులు

నీవు వారివలె వీరివలె లేనిపోని ప్రణయగాథలు త్రివ్వ కొనక, గాలిమేడలపొంతఁబోక ఆ యా విషయములను కని విని ఆనందించి, కలిగిన భావానుభవములకు రూప కల్పన చేసితివి. సంతోషము. నీవు ఆకాంక్షించిన అన్ని వస్తువులును నీ కవితలో జీవద్వస్తువు లైనవి. భావనాబలమున్నచో కవితాద్రవ్యము కాని వస్తువు లేదు. భాషలో కుంటుతనము, భావనలో కృతకత్వములేక పదాడంబరమునకు అలంకారార్భాటమునకు పెనగులాడక ముద్దు మాటలతో ముచ్చటగూర్చు రచన సాగించితివి. ఆనందించితిని. నీవు ఇంకను,

"జాతికి శుభము ల్గూర్చుచు
ఖ్యాతిని గడియించునట్టి ఘనుల చరిత్రల్
చేతము లలరఁగ ఛందో
రీతుల లిఖియింపవలయు........" నని నా ఆశంస.

విశాఖపట్నము. శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి



ఎవ్వనికొల్వు భద్రములకెల్ల నిదాన, ముదారతామయుం
డెవ్వఁడు సర్వలోకములనేలు మహాః పరిపూర్ణ మూర్తియై
వెవ్వఁడు వాఙ్మనఃక్రియల కేర్పడరాని మహాత్ముఁడాద్యుఁడై
మెవ్వఁడెసంగు సత్యమన నెవ్వఁడు వాని భజింతు నిచ్చలున్॥



ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా ఽ వశిష్యతే॥



# మనవి.

దేశ సేవకులు, సారస్వతోపాసకులు, గురువర్యులునగు శ్రీ జాస్తి వేంకట నరసయ్యగారికి, వారి ఏబది ఒకటవ జన్మ దినోత్సవ సందర్భమున మేము భక్తి శ్రద్ధలతో సమర్పించు కొను "గురుదక్షిణ" ఇది. వారు మాకు ఆంధ్ర భాష యందలి సాహిత్య విశేషములను, కవితా రీతులను సాకల్యముగ అత్యంతాదరముతో వివరించి బోధించిరి. శిష్యులమైనమేము వారిని గురించి యేమిచెప్పినను బాగుండదు. తెలుగునేల నాలుగు చెఱ గులనుండి ప్రసిద్ధ కవిపండితులు కొందరు వ్రాసిపంపిన యిందలి పద్య గద్య రచనలే వారికి సంబంధించిన విషయములఁదెల్పును. జీవితమున కుపకరించు పెద్దల భావములను గూడ కొన్నింటిని ఇందుఁజేర్చితిమి. మా యీ ప్రయత్నమునకై సర్వ విధముల ప్రోత్సాహ మొసంగిన రచయితలకు, కవులకు ఆర్థిక సహాయ మొనర్చిన మహాశయులకు, దీనిని సకాలమునకు ముద్రించి యిచ్చిన పండిత శ్రీ దేసు సత్యనారాయణగారికి మా హృదయ పూర్వక నమస్కారములు.

సెలవు.

2-8-1960<br>చిలకలూరిపేట

షేక్ ఆలి కవి.<br>వి. కొండయ్య బి. ఏ.,



# రచయితలు.



# పద్య కుసుమములు



శ్రీ రాధాకృష్ణన్, పండిత నెహ్రూ, ఆచార్య వినోబాభావే.



శాస్త్రి వేంకట నరసార్య జాతి రత్న
జన్మదినమున భక్తి సంజాతములగు
గానకుసుమాలు హృదయాలఁ బరిమళింప
ధన్య కవి శిష్యులర్పించు "దక్షిణ" ఇది.

# సమీక్ష

పరిశోధక సమ్రాట్:

శ్రీ బండారు తమ్మయ్య

శ్రీ జాస్తి వేంకటనరసయ్యగారు సహజముగ జాతీయ భావోద్దీపనము గల వారు ప్రపంచశాంతికి నభ్యుదయమునకు సర్వోదయ సిద్ధాంతసిద్ధి యత్యంతావశ్యకమని విశ్వసించి తదర్థమయి తమ సాహితీ జ్ఞానమును సాధనముగాఁ గొని తద్వికాసమును బహుముఖములుగ నంపుకయి వినియోగించి వ్యాప్తి మొనర్చుచున్న దేశసేవకులలో విశిష్ట స్థానము నలంకరించువారలలో నొకరు. గాంధిమహాత్ముని సత్యాగ్రహోద్యమములోఁ బాల్గొని యప్పటి ప్రభుత్వమువారి కారాగృహాతిథ్యమును గొంతకాలము గ్రహించి యనంతరముగూడ నిజాశయసిద్ధికై సారస్వతమునే యాలంబించి యాంధ్రభాషోపాధ్యాయ వృత్తినే జీవికగాఁ గొని బ్రహ్మచర్యాశ్రమమునందే యిప్పటికి జీవితము గడపుచున్నవారు. గాంధిగారియెడ విశేషభక్తిగలిగి తజ్జీవితచరిత్రమును ఆత్మకథ యనుపేర పద్యకావ్యముగను, మఱియు రాష్ట్రగానము, పఱిగపంట, ఆత్మార్పణము, ఉదయగానము, ధర్మజ్యోతి మున్నగు నుత్తమ

కృతుల నెన్నిటినో రచించి వాసికెక్కిన యభినవ తిక్కన శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు వీరికి మేనమామ. ఆశయములలోను, కవితాకృతులందును మేనమామపోలికలు వీరియందుఁ జాలవఱకు హత్తియున్నవి. ఏపట్టునఁ జూచినను వీరి పద్యములేమి, గద్యములేమి విశాలభావ విలసితములయి చదువరుల కానందముగూర్చుచుండును.

"కలవు సహస్రభాషలు జగమ్మున నందొకఁడేని దేనియల్
చిలికెడి తెల్గుతోడ సరిసేయఁగఁ జాలదు; విశ్వమెల్ల నీ
పలుకున కచ్చెరువ్వడు సెబాసని విజ్ఞులు మెచ్చ సుందరో
జ్జ్వల కవితన్ సృజించి మన జాతికి నభ్యుదయమ్ముఁ గూర్పుఁడీ."

అను పద్యము వీరి మాతృభాషా దేశాభిమానముల కాదర్శకము.

1. ఖండకృతిలో పద్యములన్నియు భావౌన్నత్య, భాషాలాలిత్యములతో సుబోధకములుగ నింపెసలారుచున్నవి. అందఱు చదివి యానందింపఁదగినవి.

"పుష్పవాంఛ" యందలి

"దేశగౌరవసంపత్తి దీక్షతోడఁ,
గాచుచుండెడివారల కరములందు
జాతిసాహిత్యసర్వస్వ సదనమందు
మానకెప్పుడు నివసింప నేనుదలఁతు."

కోరను యశమును సుఖమును
గోరను రాజ్యంబు నెపుడు గోరనుము క్తిన్
గోరుదు నార్తులసేవను,
గోరుదు నా హృదయమందు క్షోణీహితమున్."

అను పద్యములలోని భావౌచిత్యము ప్రశంసింపఁదగినది.

2. వ్యాసవాణి:- ఇందు సాహిత్యము, కళారాధన, సంస్కృతి, లలితకళలు, గేయకవిత, కవి, కర్మయోగి, పఠన మందిర గ్రంథాలయ లాభములు, చిత్రశిల్పములు అను విషయములవయి సత్యసమ్మతములయిన యుదారభావములతో వీరు రచించిన చిన్న చిన్న వ్యాసములు సేకరింపఁబడి ముద్రింపఁబడినవి. అమోఘాశయములతో భావములతో నాతిదీర్ఘములుగ రచింపఁబడిన యిందలి వ్యాసము లెల్లరు నవశ్యముగఁ బఠింపఁదగినవి.

3. కవిత:- నన్నయ మొదలుకొని నేఁటిదనుక వెలసిన ప్రాచీ నాధునిక కవివతంసులలోఁ బలువురు కవి, కవిత. ఆంధ్ర భాష, చిత్రకారుఁడు, పేదలు, తెనుఁగుతల్లి, ఆంధ్రవిద్యార్థి, భారతమాత, భారతనారి, మైత్రి, గురువు, పుస్తకము, శారద మున్నగు విషయములఁగూర్చి వ్రాసిన రసవత్పద్యముల నేర్చి కూర్చిన సంకలనగ్రంథ మిది. జోహారు, ముందడుగు, ఆంధ్ర మాతృస్తవము, ఆంధ్రపతాకము, తమ్ముఁడా, ఆంధ్రులం, దేవాలయం-గ్రంథాలయం, దేశభక్తి, సమతాధర్మము,

తెలంగాణోయి, సైనికశిక్షణ, కవినోయ్, మంగళం అను శీర్షికల క్రింద నేటి కవికుమారులు రచించిన గీతములు, బంకించంద్ర, రవీంద్రనాథుల జాతీయగీతములుగూడ జివరఁ గూర్పబడి యున్నవి. ఆకృతిలోఁ జిన్నదయ్యు విషయవిశిష్టతచే మిన్నయై యున్న యీపొత్తమాంధ్ర సోదరులకెల్ల నాదరణీయమని యభినందించుచున్నాము.

విశాలహృదయులగు శ్రీ వేంకటనరసయ్యగారు మధ్య మించిన ఘన కార్యములలో భారతీసమితి భారతీసన్మాన సంఘముల సంస్థాపనము, తత్కార్యక్రమములు గణనీయములు, ప్రశంసనీయములు నయియున్నవి. వీరు, వీరి యనుయాయులు విద్వాన్ శ్రీ కోగంటి దుర్గామల్లిఖార్జునరావుగారు (గుడివాడ తాలూకా పామఱ్ఱు హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులు) మున్నగువారీ సంస్థల నిర్వహించుచుఁ బ్రజల నుండి విరాళముల సేకరించి భాషాపండితులను, కళోపాసకులను దేశసేవకులను బిరుదప్రదానములతో నేగాక యర్థరూపక సత్కారములతోఁగూడ సన్మానించి యాదరించుట యెంతయు ముదావహము. ఇంతవఱకు వీరిచే సమ్మానితులయినవారలలో కీ. శే. మంగిపూడి వేంకటశర్మగారు, పేరు ఫరీదుకవి, బందరు వాస్తవ్యులు నాటకపితామహ శ్రీ చిత్రపు హనుమంతరావు, విమర్శకాగ్రేసర శ్రీ కొత్త భావయ్యచౌదరి, శ్రీరాం వీర

---

10-11-1945 భారతి సమితి స్థాపితము.

బ్రహ్మకవి, శ్రీ భమిడిపాటి అప్పయ్యశాస్త్రి, శ్రీ బొడ్డపాటి పూర్ణసుందరరావు, శ్రీ పెన్మెత్స సత్యనారాయణరాజు, శ్రీ గొట్టిపాటి వేంకటసుబ్బయ్య, శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి మున్నగు వారున్నారు; ఇట్టి సన్మాన సందర్భములలో సంచికలును వెలువడినవి. వానిలో నాయా పండితులకు సంబంధించిన సన్మానపత్రములు సందేశములు ప్రశంసలేగాక యుపయుక్తములగు నితరవిషయములుగూడ నందందుఁ గలవు.

ఈసంస్థలు గావించుచున్న యేతాదృశసేవ యత్యంత ప్రశంస నీయమని చెప్పనక్కఱలేదు. జయప్రదముగ నిజాశయములు నిర్వహింపఁగల్గుటకయి యాంధ్రులెల్ల రౌదార్యముతో వానికిఁ దోడ్పడెదరు గాక యని యాశించుచున్నారము.

కా కి నా డ. } ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, దుర్ముఖి-మార్గశీర్ష పుష్య మాసములు.



# విశిష్ట గుణాలు

సాహిత్యరత్న:
బాలశౌరి రెడ్డి,

"పంచామృత" అనే వీరి హిందీ గ్రంథానికి కేంద్రసాహిత్య అకాడమీ రెండు వేలు, ఉ. ప్ర. ప్రభుత్వం 300 బహుమతి ఇచ్చినది.

తెలుగు వాఙ్మయ వికాసానికి మీరు చేస్తున్న సేవ ప్రశంసనీయము. మీ గ్రంథాలనన్నింటిని ఆద్యంతం ఎంతో అభిరుచితో చదివాను. మీ బహుముఖ ప్రతిభ కొనియాడ దగినది. కవులుగా, నాటక రచయితలుగా, కథా రచయిత లుగా మీరు ఆంధ్రదేశానికి చిరపరిచితులు.

కవిత్వం మృదుమధురభావాలతో పఠితల హృదయా లను ఆనంద సాగరంలో ఓలలాడించి తన్మయులను గావిస్తుంది. ఒళ్లుపులకరింప జేస్తుంది. భావానికి తగిన భాష భాషకుతగిన మాధుర్యం మీ కవిత్వంలోని విశిష్టగుణాలు. జాతీయ భావా లతో నిండిన మీ "జయభేరి" పఠితల హృదయాల్లో దేశభక్తి బీజాలు వెదజల్లి మానసిక పరివర్తన గల్గించగలదు. ముఖ్యంగా "భారతాంబ" "కష్టజీవి" "నవభారతం" "సోదరా" "స్వాతంత్ర్యం" పేర్కొనదగ్గవి. మరీ మరీ చదివి తృప్తి

చెందాను. మీ నవగీతాలు విద్యార్థులు ప్రతి నిత్యంగానం చేయతగ్గవి. మీ కృషిని యావదాంధ్రలోకం గుర్తించి మీ ప్రబోధాత్మక గీతాల్లో మీరు కావించిన నిర్మాణాత్మక సూచనలను గౌరవించ గలదని ఆశిస్తున్నాను.

ముఖ్యంగా మీ ఖండకృతిలో "కవి" పద్యాలు మధు రాతి మధురములు. నేననేకసార్లు మరీ మరీ పఠించాను. "చిత్ర కారుడు" కంఠస్థం చేయతగ్గది.

మీ నాటకాల్లోని పద్యాలు నన్ను విశేషంగా ఆకర్షిం చాయి. నేటి సంఘంలోని ఘట్టాలను ఇతివృత్తాలుగా గ్రహించి చాలా తక్కువ నాటకాలు వచ్చాయి. మీరీ క్షేత్రంలో ఒక క్రొత్త మార్గాన్ని త్రొక్కారని చెప్పవలసి ఉంటుంది,

విద్యార్థుల కుపకరించు విధంగా మీరు మహాపురుషులు, కవులు, సంఘ సంస్కర్తలు, దేశభక్తుల జీవితాలను సరళ మైన భాషలో హృదయరంజకముగా చిత్రించి వారి జీవితం లోని విశేషాలను చక్కగా వర్ణించారు. భావి భారత పౌరు లైన విద్యార్థులకు యివి ఎక్కువ ఉపకరించి వారి ప్రవర్తన నిర్మాణానికి దోహద మొసంగ గలవని ఆశిస్తున్నాను.

"పుష్పవాంఛ" హిందీ సాహిత్యంలోని మాఖనలాల్ చతుర్వేదిగారి "ఫూల్ కీ చాహ్" అన్న రచనను జ్ఞప్తికి

తెస్తుంది. దేశాభిమానం ఉట్టిపడే విధంగా మీరు దేశభక్తి బీజాలను విద్యార్థుల లేతహృదయాల్లో నాటి వారిని వీరులుగా తయారుచేయ సంకల్పించినందుకు నా ధన్యవాదాలు సమర్పిస్తున్నాను.

పోతే "వ్యాసవాణి"లో మీరు చక్కని రచనలు సంగ్రహించారు. కాని కొంచెం విపులంగా వ్రాసియుండిన అవి సాహిత్యవేత్తలకు కూడా పూర్తిగా ఉపకరించేవి. మీ రచనా శక్తికి భావగాంభీర్యతకు, విషయపరిజ్ఞానానికి అవి ఉత్తమ ఉదాహరణలుగా పేర్కొనవచ్చు. అవి నన్నెక్కువగా ఆకర్షించాయి. లలితకళలు కళలలో భావగర్భితమైన వ్యాసాలు, ప్రతి ఆంధ్రుడు చదువతగ్గవి.

ప్రయోజనముల కుపకరించు రీతిని మీరెన్నో రచనలు సాగించి వారందరికీ ఉత్తమపరిజ్ఞానాన్ని గల్గించ సంకల్పించారు. మీ ఆశయం తప్పక సఫలీకృతం కాగలదు

మదరాసు } హిందీ ప్రచార సభ,



# జాస్తివారి రచనలు

మధురకవి :

శ్రీ బెల్లారి శ్రీనివాసమూర్తి

వీరు తమ చక్కని రచనలతో ఆంధ్రుల అభిమానము చూరగొన్న కవులు. తెల్గువారికి పేరిమపాటులు, ఖండకృతి, వ్యాసవాణి మున్నగునవి వీరి కృతులు.

కవులలో కొందఱిది కేవలము రసదృష్టి. మరికొందఱు విశ్వకళ్యాణము ప్రధానాదర్శముగా రచనగావింతురు. రసము లోక కళ్యాణము రెండును సమపాళమున దృష్టినిడుకొన్న రచయితలు మరికొందఱు. ఒక్కొక్కమారు ఒక్కొక్క మార్గము నాదరించుచు పర్యాయమున సర్వతో ముఖమైన అభిరుచిగలవారు నరసయ్య కవిగారు.

"ఖండకృతి" వీరి కవితావిష్కరణము. అన్ని ఖండికల యందును దేశభక్తి, జాతీయత పరవళ్ళు త్రొక్కుచున్నవి. ఇందలి 'తెలుగు భాష' పండితులకొఱకే యుద్దేశింపబడినది గాదు, ప్రజాభాషయుగాదు. మఱి రెండు తెగలవారికి ఆదరణీయమైన జీవద్భాష.

"పుష్పవాంఛ" "రాష్ట్రి ప్రబోధము" వంటి రచనలందు ప్రత్యేకించి చూడ తగ్గవి. ఆద్యంతము, "సేవయే మానవ ధర్మము,"గా భావించి రచన సాగించుట వీరిమతము.

రాజకీయముగా తెలుగునాట మార్పువచ్చినా—రాక పోయినా, రాయలసీమవారు ఉత్తరాంధ్రులు, తెలంగాణా రచయితలు, ఏకీభవించి కావ్యరచనోత్సాహమున సేవా ధర్మమునకు నడుముగట్టుకొన్న సుదినములివి. భారతీకైంకర్యమున వీరికి గల సుహృద్భావము అవిచ్ఛిన్నము—అఖండము.

శ్రీ నరసయ్యగారి రచనలలో నిట్టి తీయని తలపులు కాపురము సేయుచున్నవి.

వీరి "వ్యాసవాణి" గద్యరచనా పాటవమునకు వీరి సారస్వత పటిమకు నిదర్శనమైన కృతి. ఇందు కళను గూర్చిన వీరి చర్చ శిరసావహింపదగినది. అనేక విషయము లందు సమీక్ష సేయబడినవి.

"కవిత" వీరు కావించిన పద్యగేయ కవితాసంకలనము. ఈ రచనలు ప్రాచీనులకు ఆధునికులకు సంబంధించినవి. నానా కవుల దేశభక్తి పూరితములైన ఖండములీ సంపుటిలో కూర్చ బడినవి. ఈ పంథాలోనిది తొలి సంపుటముగాబోలు, కాల క్రమమున మరికొన్ని సంపుటములు భిన్న భిన్న దృక్పథము లతో బయలుదేరుట సాహితీ రసికుల సమర్చన వంటిది.

శ్రీ 'జాస్తి' వారి సాహిత్యసేవ బహుముఖమైనది. స్వయం రచనలేగాదు. వీరు 'భారతి సన్మాన సంఘం' స్థాపిం

చిరి. సాహిత్య సభలు, కవిసన్మానములు గ్రంథప్రచురణము ఈ సంఘ ఫలితము.

వీరి రచనలన్నియు చదివి సంతసించితిని. ప్రతి పద్యము, ప్రతి గద్యము వీని నిర్మల దేశసేవారక్తిని చాటుచున్నవి. నేటి జనత ఈ రచనల చదివి తనియగలదు.

నేటి తెలుగువారి భావతపస్సు పవిత్ర గంగా స్రోతస్విని వలె మూడు పాయలైనదని వెనుక సూచించితిని. అందఱు ఈ కవిగారి రచనలు పఠించి, వారిని సాహితీ సభల కాహ్వానించి సందేశములంపిని ధర్మ నిర్వాహణ పరాయణులు కాగలరని మనవి.

కైవానూరు పండితులు, కళ్యాణదుర్గం, అనంతపురం జిల్లా.

---

## ప్రి ష ర ణ లు.

మీ భారతీ సన్మాన సంఘమునుగూర్చి, ఆ సంస్థ యొక్క ప్రచురణలగూర్చి, మరియు కార్యక్రమమునుగూర్చి ,ఆంధ్ర దేశాని కంతటికి బాగా తెలిసిన విషయమే. నేను గూడ స్వాయముగా మిమ్ములను కలుసుకొన జాలకపోయినప్పటికి మీ ప్రచురణలు చదివి ఆనందించిన వారిలో నొకడిని. మీ తోడ్పాటు అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తునకు లభించ గలదని ఆశించుచున్నాను.

— దేవులపల్లి రామానుజరావు,

కార్యదర్శి: ఆం. ప్ర. సాహిత్య ఎకాడమీ, హైదరాబాదు.

# జాతీయ మధుర కవి


విద్వాన్: షేక్ దావూద్

కర్నూలు ఇస్లామియా కాలేజి పండితులు.


వీరి జీవితము దేశమున కంకితము. స్వాతంత్ర్య సమరమున మనః ప్రాణములనొడ్డి కఱకు చెరసాలలమ్రగ్గి అద్వితీయ త్యాగమును వీరు ప్రదర్శించిరి. ఉభయ భాషలలోఁ జక్కని చిక్కని పాండిత్యము నలవఱచుకొని లేఁత వయస్సుననే ఆంధ్ర విశ్వవిద్యాలయ విద్వద్బిరుదమును సాధించిరి. వీరు కవులు. గ్రాంధికవాదులు. తాము కవిత్వమును వ్రాయుట టుంచి యితరులను బ్రోత్సహించి వృద్ధికిఁ గొనివచ్చుటలో వీరిది యందెవేసిన చేయి. తమ ప్రేరణవలన వృద్ధికి వచ్చిన వారింగాంచి మురియుట వీరి గొప్పదనము.

కవిత యందఱకు నర్థము కావలయునని వీరి యభిమతము. కవితాసారము నరదరు గ్రోలవలయునని వీరి యుబలాటము, అభిమతము. అందఱ కానందము గూర్పవలయునను భావముతో వీరు సరళములగు పదముల నేరియేరి కూర్తురు.

వారు ప్రజానీకమునకు అర్థము కావలయునన్న కుతూహలాధిక్యము వలన, నవగీతములు, బుఱ్ఱకథలనుగూడ సలక్షణమగు గ్రాంథిక భాషలో వ్రాసి ప్రఖ్యాతినందియున్నారు.

వారు కావించిన భాషాసేవ అమూల్యము. శ్రీ శాస్త్రి వేంకట నరసయ్యగారికి మంచి సంస్కారము ఉన్నది. వేదిక నెక్కినచో మంచి యుపన్యాసము నొసఁగి సామాజికులను చక్కగాఁ దమదిశ కాకర్షింతురు. పెద్దల గోష్ఠులలో మెలఁగి యలవఱచు కొన్న ప్రతిభ, గ్రంథ పఠనములవలన గలిగిన సంస్కారము, శాస్త్రముల అధ్యయనమువలన లభ్యమైన వ్యుత్పత్తి బాగుగ నున్నవి. అవివాహితులు. ఆజన్మ బ్రహ్మచర్యము. అదియును సర్వేశ్వరు ననుగ్రహమువలన దానినుండి తొలఁగనిది. వివాహ జీవనపు బాటను కావ్యపఠన రచనలయందు లయమొనర్చి నారు. వారిది అదర్శ జీవనము.

పూజ్యపాదులు అభినవ తిక్కన తుమ్మల సీతారామ మూర్తిగారు తమ 'శబల' అను కావ్యమును నరసయ్యగారి కంకితమొసంగుచు నిట్లనినారు.

"నా నేనల్లిన కిల్లువాకిలియుఁగాంతా విత్తముల్ కావ్యముల్
గామిం బెద్దకలంగి డీల్పడుదు రక్తస్పర్శ మూలమ్ముగన్;
సీమల్ దాటిన తద్విరాగము కృతిస్వీకార భోగాహిత
ప్రేమంబై వడితగ్గి నామదికిఁ దృప్తింజూపె నీ నాటికిన్.

"ప్రతిభకుఁగాదు నేరిచిన ప్రజ్ఞకుఁగాదు వయఃప్రమాణ గ
ణ్యాతకునుగాదు లౌకిక మహత్తకుఁగీర్తికి మూర్తి కేని గా
దెతని జితేంద్రియత్వమున కేను గరంగి కృతిప్రదాతనై
సతత సుఖాయురున్నతి వశంపడ దీవనలిత్తు వీనికిన్."

ఈ యమృతపూరమునందు అద్దమున బింబమువలె నరసయ్యగారి జీవితమును ప్రదర్శించు విశిష్ట వాక్యములున్నవి. అందువలననే వారు దేశమున కంకితమై తమ జీవితమును సార్థక పఱచి చరిత్రలోఁ గొంత మంచి స్థానమును ఆక్రమింప నున్నారని మనవి చేసితిని.

పరోపకార బుద్ధియందు వీరికివీరే సాటి. ఆంధ్రదేశమున సర్వత్ర వీరు పండితులకుఁ బరిచితులు. *'భారతీ సన్మాన సంఘము' అను పేర ఒక సంస్థను నెలకొల్పి ధనమును ప్రోగొనర్చి చాలమంది కవులకు రచయితలకు గాయకులకు లలిత కళలకన్నింటికిఁ బ్రోత్సాహ మొసఁగునుద్దేశముతో సన్మానములను జరుపుదురు. వారిం బ్రశంసించుచు విమర్శక వ్యాసములు వ్రాయుదురు. సన్మాన సంఘమునకు వీరధ్యక్షులు. శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు కార్యదర్శులు, వీరీ సంస్థద్వారా చాలమంది కవులను బ్రోత్సహించుచున్నారు. అవి యిన్నియన్నియని చెప్పఁగడఁగము. సతతప్రోత్సాహము. నిరంతర భాషాసేవ, అనవరత కవిసన్మానములు ఈ సంస్థ కార్యములు.

షేక్ ఫరీద్ కవి (వినుకొండ) గారు మంచి కవిత వ్రాయుదురు. పాపము వారిని లక్ష్మి బొత్తిగాఁ దిరస్కరించినది. వీరు వారి పేదతనమునుగూర్చి చాల వ్యాకులపడిరి. ఆంధ్రదేశమునం బలుతావుల వారికి నవకాశము లిప్పించి సన్మాన

* 20-11-1950 స్థాపితము.

ములు జరిపించి యశమార్జించి తమ యాదర్శ సేవా భావమును ప్రకటించినవారు వేంకటనరసయ్యగారు. షరీద్ కవిగారినింకను బాగుపఱచ ప్రయత్నించుచు వివిధ ప్రదేశములకు నుత్తర ప్రత్యుత్తరములు జరుపుచుండిరి. ఈ లోపల షరీద్ కవిగారీ లోకమును విడనాడిరి.

వేంకటనరసయ్యగారు తమ జీవితమును ప్రజాసేవ కంకితమొనర్చిరని నేను ముందుగనే తెల్పితినిగదా. నా 'దాసీ పన్నా' కృతి ప్రకటితమైన తర్వాత భారతీ సన్మాన సంఘము తరఫున వీరు తొట్టతొలి నన్ను గుడివాడ వేదికయందు 116 రూపాయలతో సన్మానించిరి. వివిధ కష్టములుచుట్టి యర్థ మృతుఁడనైయున్న నన్ను వారు తమ ప్రోత్సాహన శక్తియను నౌషధముతో మానసిక స్వాస్థ్యమును గూర్చిరి.

ముస్లిములు ఆంధ్రభాషలోఁ గవిత వ్రాయుచున్నారని వీరు మాపయి అనన్యమగు నెనరు తోలఁకరింతురు. ఇట్టివారి ప్రోత్సాహములే మాకు జీవగఱ్ఱలు.

ఖండకృతియందలి శీర్షకములన్నియు దేశముద్దేశించి సమాజముద్దేశించి వ్రాసినవి. వ్యాసవాణియందు సాహిత్యము, సంస్కృతి, లలితకళలు మున్నగువానిపై అనేక వ్యాసములున్నవి.

వీరు గుంటూరుజిల్లా చిలకలూరిపేట హైస్కూలు నందు తెలుఁగు పండితులు, విద్యార్థులు వీరి పేరువిన్న చేతు

లెత్తి దండములు పెట్టి ప్రశంసింతురు. వీరి భాషణమందును చరిత్రమందును ఆదర్శమునందును సమ్మోహనశక్తియున్నది.

'ఖండకృతి' యందొక శీర్షిక 'పుష్పవాంఛ'. అందు వీరు

"రాజాధిరాజుల రమణీయకంఠాల
వసియింప మదియందు వాంఛలేదు
కాంచనపూజయే కర్తవ్యమను చోట
వసియింప మదియందు వాంఛలేదు

ద్వేషరాగమ్ములున్నట్టి దేశమందు
స్వార్థపూరిత మానవచయమునందు
సమతలేనట్టి విమతుల సంఘమందు
వాస ముంజేయ మదియందు వాంఛలేదు"

(మరి వాంఛయేమి?)

జాతికి సేవలం జల్పు భక్తుల తల
నివసింప సతతమ్ము నేఁదలంతు
కర్మయోగులుపోవు కాలిబాటలయందు
నివసింప సతతమ్ము నేఁదలంతు.

దేశగౌరవసంపత్తి దీక్షతోడఁ
గాచుచుండెడి వారల కరములందు
జాతిసాహిత్య సర్వస్వ సదనమందు
మానకెప్పుడు నివసింప నేను దలఁతు.

ఇది పుష్పవాంఛయే కావచ్చును కాని యీ కవి యాదర్శజీవితము నరసిన భావమునకుఁదగిన యాచరణమెంత సరిగనున్నదో స్పష్టముకాఁగలదు. ఇట్టి కవి రచనము లక్ష్య లక్షణములకుఁగాని గౌరవింపఁదగినది.

వీరికి అలవడిన విద్య పైతృకము. వీరి పితరులు సుబ్బయ్యగారు భారతాది పురాణ గ్రంథములను ప్రజలకు నవరస భరితమగు భాషతో బోధసల్పి వారివలన బహుసభా పూజలందినారు. వారింగూర్చి వ్రాయుచు నభినవ తిక్కనగారు తమ 'శబల' కావ్యము అంకితమున.

"ఆతని తండ్రి సద్గుణమహోజ్వలుఁడు
పండితుఁడస్మదీయ శ్రీ
చాతురికాది తీర్థమభిజాతుఁడు
సుబ్బయ మామకీనమీ
రీతి నెఱింగి పొంగుననుదృష్టియు నే
తదుపాయనంబిడన్
హేతువు పుత్రిరూప గురుఁడేకద! వీఁడు
శ్రుతిక్రమమ్మునన్"

"అటు గురుని ఋణముదీర్చుట
కిటు సోదరిబిడ్డ వలపునీడేర్చుట కొ
క్కటె చాలున్ బనియని వేం
కటనరసయ కితనికిడెద కవితన్ శబలన్"

అన్నారు. చరిత్రార్థములు, ఉపదేశాత్మకములు, సహో
షకములగు నెన్నివిషయములు ఈపద్యములందు రూపమును
గొన్నవో చదివి యానందింపవలయును. నరసయ్యగారికి లభిం
చిన సరస్వతి పూర్వులనుండి సంచితమైనదేగాని యన్యత్ర
గ్రహించినదిగాదు. వారి తండ్రి తమ వైదుష్యముతోఁ జాల
మందిని సాహితీ సంపన్నులఁగావించినట్లు తెలియును. ఈ క్రింది
పద్యమున వేంకటనరసయ్యగారు

కర్మయోగము లక్ష్యమునిర్మలమగు
చిత్తమందున నే ప్రొద్దుఁజేర్చినావు
భారతాదుల నవరస భరితముగను
బోధచేసితి బహుసభాపూజలంది.
"తత్వవేత్తలలోన। తలమానికంబవై
చరియించుచుంటివి, సాధువృత్తి
ఆది జనకాదులకు సాటివైతి జనక"

అన్నారు.

'కవి' అను శీర్షికయందు వీరు

తెలుఁగుల తొంటిపౌరుషము తేకువజాఱఁగ వ్యర్థరోషముల్
బలసె సమాజమంతయును బాధలఁజెందుచు నుండె నిచ్చలున్
గలుగదు విద్దె తిండియును గష్టము నోర్చెడి పేదవానికిన్
కలమున వీని దిద్దికృపఁగా చెడువారు కవీశులేగదా॥

వీరిరచన ప్రతిశీర్షికం గనన్పట్లు భావములలో వీరియం
దున్న సేవాగుణమును బ్రదర్శించును. పేదలకుఁ దిండియు

విద్యయుఁ గావలయునని వీరి మనోవేదనము. కవిత కవితకొఱకు గాదు. మానవసమాజ కళ్యాణమునకు, విశ్వశ్రేయమునకు రచించవలయునని వీరి అభిప్రాయము. వీరు తమ కవితలోఁ బెనుంగునకు ముఖ్యస్థానము నొసఁగిరి. అది యొక గొప్ప కార్యము.

"అది, ఇది" అనుశీర్షిక యందు వీరు.

ధనికుల్ కొందఱు సంతతింబడయ కాత్మన్ లెస్స దుఃఖింపఁగా
జనుసంతానము నీఁదలేక వగతోఁ బేదల్,విలాపింత్రు, సా
మ్మునకేఁబోవము లేనివారు చదువంబో రార! విద్యారతుల్
ఘనదారిద్ర్యముచేత నాగెదరులోకంబెంత చిత్రంబహో.

మనము ఈ పద్యమునందు కనఁబఱుపఁబడిన వృత్తము సర్వత్ర ప్రపంచమున నున్నదున్నట్లు చూచుచున్నాము.

పేదిబడులలో చక్కఁగా ఐదవతరగతి వఱకు చదువు కొన్న బాలుఁడు వారికవిత్వము నర్థముచేసికొనఁగలఁడు. ఇది నిత్యము సేవనుగూర్చి తెలుపుచు కవిగారు

సేవయె మానవధర్మము
సేవయె హృదయమునుమార్చు చింతల నడఁచున్
సేవయె భారతలక్ష్యము
సేవయె మనకనుఁగుఁదోడు చింతామణియున్

ఆశింపక ఫలమించుక
పాశవిక గుణాళి విడచి పరహితమునకై
క్లేశము కాలము విద్యను
దేశము మెచ్చంగ నిచ్చు ధీరులు ధన్యుల్.

దేశము, స్వాతంత్ర్యము నిష్కామసేవ విశ్వప్రేమ జాతిమతరహిత మానవసమాజము పేదలయందు దయ, విద్యాదానము- అను వానింగూర్చి చిరురచనలు అనేకములుగలవు. వీని అన్ని శ్రేణికలను సాధారణ విద్యార్థులను మనమున నిడుకొని వారికర్థమగునట్లు వ్రాయుదును.

వీనిలోపల మంచి ప్రతిభయున్నది శాస్త్రవాసనయున్నది. తాముచూచి యనుభవించిన కష్టసుఖముల పరంపరలున్నవి. తెలుఁగు బిడ్డలకు నరసయ్యగారొసఁగు ప్రోత్సాహము.

ఆజని శ్రద్ధన్ జదువుము
ధీరుఁడవైనిల్వుమయ్య విజ్ఞానమునన్
సారపరీక్షారణమునఁ
జేరండఁగదయ్య కీర్తి పింపిసలాడన్

కడఁగి స్వాతంత్ర్య రక్షణక్రమమునందుఁ
జటులతర శిక్షణాభ్యాసపటిమచేత
సాటియోధులలోపల మేటివగుచు
తేజరిల్లుము దేశానఁ దెలుఁగుబిడ్డ.

తెలుఁగుబాస, ఆంధ్రదేశము, తెలుగుకవిత తెనుఁగు మగటిమినిగూర్చి మీరు పలుతావుల రసవత్తర కవిత వ్రాసియున్నారు. తెనుఁగు భారతికి మీరి ఖండకృతియొక యలంకృతి. విశేషించి బాలసాహిత్యమునకు నిదియెంతయుఁదోడ్పడగలదు.

దేశమునఁగల యిట్టి సేవాపరాయణులు కొనియాడఁదగియున్నారు. సర్వసాధారణముగ లోకము స్వార్థమునే ప్రధానముగఁగొని 'మన' తన యనుభావముల నరయుచున్నది. అది లోకమునకుఁబనికిరానిది. లోకమునకు ఆదర్శము నెత్తి చూపవలయును. చరిత్రకది గొప్పదోహదము. శ్రీ జాస్త్రి వేంకట నరసయ్యగారికి సర్వేశ్వరుడు దీర్ఘాయు రారోగ్యభాగ్యముల గూర్చుగాక.



నిరంతర నూతనోత్సాహముతో లలిత లలితముగాఁ గొనలుసాగుచున్న మీ సాహిత్యకృషికి నా నమోవాకములు. మీరు ఈనాటి పండితులకు ఆదర్శమూర్తులుగా దీపింపఁగలరని నా యాశయము. జవసత్వములు తొణికిసలాడుచున్న యువమూర్తులుగా మీరు నాకు గోచరింతురు. 'కవిత' లో మీరేర్చి కూర్చిన మధురఘట్టములు నాకానందముఁగూర్చినవి. వ్యాసవాణిలోని విషయములుచాలమంచివి. నిరంతర కవితాగోష్ఠితో సాహిత్యాభిరుచులతో మీ దృక్పథమొక వింతవాతావరణమును సృష్టించుకొనుచు మీ జీవితమునకు ఇంకను శోభ దెచ్చుగాక.

ఉభయ భాషాప్రవీణ: చిన్నము రామయ్య.

# సాహిత్యము

శ్రీ యస్. బి. సుబ్బారావు,
కార్యదర్శి : జాతిభేద నిర్మూలక మండలి.

సాహితీలోకమున శ్రీ వేంకటనరసయ్యగారి పేరు సుప రిచితము. ఆయన బహుళ గ్రంథకర్త, సాహిత్యోపాసకుడు, గ్రంథాలయసేవకుడు, ఉపాధ్యాయపండితుడు. అంతేకాదు, ఆయన దేశభక్తుడు, సత్యాగ్రహి. కారాగారవాసి. అంతకం టెను ఆయన పరమ ధార్మికుడు, బ్రహ్మచర్యవ్రతుడు.

ఆయన కర్మయోగి, ఎందఱో దీనులకు జేయూతనిచ్చిన వాడు. యువ రచయితలను ప్రోత్సహించి, సాహితీ వసులను గావించిన విశాలహృదయుఁడు.

వీరి రచనలందలి యితివృత్తములే వీరి స్వభావమును చెప్పక చెప్పుచున్నవి. పాఠశాల, గురువు, జనకుడు, కర్తవ్యము, గ్రంథాలయము, భగవద్గీత, ప్రార్థన, ఆకాంక్ష, సేవ, భూత దయ, సత్యము, సమత, మహాత్ముడు మున్నగునవి యాయన "ఖండకృతి" యందలి కావ్యవస్తువులు. సాహిత్యము, లలిత కళలు, కళారాధన, సంస్కృతి, కర్మయోగి, కవి మున్నగునవి వీరి "వ్యాసవాణి" యందలి శీర్షికలు. "ఆంధ్ర సేవకులు"

"ఉత్తమకథలు" మహాపురుషుల జీవితచరిత్రములై యున్నవి. రచయిత మనస్తత్త్వమును నిర్ధరించుటకీ యుదాహరణములు చాలును

వీరు ఇరువది సంవత్సరముల ప్రాయమున కళాశాల విద్యార్థిగానున్న తఱి, గాంధీజీ నాయకత్వమున స్వాతంత్ర్యోద్యమము వెల్లుబికెను. యువావస్థయందున్న యీ రచయిత జాతీయ భావావేశపరుడై ఉప్పుసత్యాగ్రహ మహోద్యమమునఁ బాల్గొని, శాసనోల్లంఘనముచేసి కారాగారమున కేతెంచెను. తదాది ఆయనయందు, జాతీయతా భావములు పరివృద్ధినొంది క్రమముగ విజృంభించినవి. తత్పరిణామమే ఆయన రచనలు జాతీయ రచనలు. వీరు వీరి సహోపాధ్యాయులగు శ్రీ ఘూళిపాళ వేంకట సుబ్రహ్మణ్యంగారు, జాతీయతనుపురికొల్పు కొన్ని రచనలు గావించిరి. "చలోఢిల్లీ" "వైతాళిక కథలు" "కాంగ్రెసు విజయము" "జాతీయ కథలు" "ఆచార్య రంగా" "ప్రజారాజ్యము" "జయభేరి" "ఉపాధ్యాయుడు" "జాతీయ దసరాగీతాలు" మున్నగునవి యట్టివే.

గాంధీజీ బోధనలవలన మిక్కిలిగ ప్రభావితులైనారు మన కవిగారు. సత్యాహింసలపైన వీరికి ప్రగాఢ విశ్వాసము గలదు. దరిద్రనారాయణుని సేవయందు వీరి కనురాగము మెండు. వీరి రచన లందంతటనిది కానవచ్చుచుండును. చూడుడు.

"చలి పందిళ్ళను బెట్టుటో జనులకున్ సంసేవలన్ జేయుటో
నిలయమ్మందును నిల్పి విద్యలసదా నేర్పార బోధించుటో
కలవిజ్ఞానము జాతికిందెలుపుటో, గాకిట్లు వర్తింతురే!
బలులంచున్ సవనంబులంచు నెప్పుడున్ బ్రాణమ్ములన్
దీయుచున్"

కం॥ శాకమ్ములు, సూపమ్ములు
ప్రాకటముగ బెరుగుపాలు పరమాన్నమ్ముల్
గైకొని యాకలి నణపుడు
కాకర్మము హింసమాని గాంచుడు సుఖముల్.

సీ॥ విశ్వమానవమైత్రి విలసిల్లి పుడమిలో
సంగ్రామ విరమణ జరుగు నరకు
ఆహారమే లేక యాత్మహత్యకు బూను
మానవలోకమున్ మనుచు వరకు
ఆధారమే లేని యనదలందఱుగూడ
విద్యాసమగ్రులై వెలయు వరకు
హింసకాపట్యాది హేయగుణావళి
మలిన కర్మమ్ములు మాన్పువరకు
సంఘసంస్కారమంతట జరుగువరకు
లలిత కళల వికాసంబు కలుగువరకు
ధర్మ రాజ్యమ్ము సర్వత్ర తనరువరకు
వలదు కర్తవ్య ధర్మముల్ వదలనలదు.

వీరు ఆర్ద్రహృదయులు. దీనుల యొక్కయు నార్తుల యొక్కయు స్థితిగతులఁజూచి వ్యథఁజెందుట చూడుడు.

"అనదల్ బెంకిగుందుచున్ మిగులనార్తాలాపముల్ సేయువో
మనసారన్ సుఖయింపనోచక జనుల్ దాస్యమ్ము సేపట్టిరో
ఘనదారుణదుఃఖమునందుఁ గ్రుంగి విధవల్ కన్నీటిన్ వెల్లారించువో
గనగాఁగన్నుల నిండునీరు, మనకీకష్టమ్ము లెట్లాఱునో"

వీరిటుల కరుణార్ద్ర హృదయులుగనుకనే, సమతాధర్మ మువైపు మొగ్గిరి. దారిద్ర్యముఁ బోనాడవలెననియు, సాంఘిక వ్యత్యాసములను తొలగింపవలెననియు వీరు ఆకాంక్షించిరి.

"హక్కులు బాధ్యతల్ విధులు నంతటఁదప్పక చెల్లగావలెన్
గ్రక్కున బంజరుల్ కృషిని గాంచి సుధాన్యములీయగావలెన్
ఎక్కువ తక్కువల్ విడచి యేకసమాజము చేయగావలెన్
నిక్కము నీల్గుచున్ మనెడి నీచపులేమిని బాపగావలెన్."

వీరు భారత పౌరులనే విధముగ ప్రబోధించిరో చూడుడు

"లెమ్మా భారత పౌరుడ
కొమ్మా శపథమ్ము మనసుకోర్కె ఫలింపన్
రమ్మా! సమతావాదము
సమ్మానముతోడ నిలుప శాంత పథానన్."

జన్మగత వర్ణవ్యవస్థయన్న వీరికి బొత్తిగాగిట్టదు వలు చోటుల వీరు కులభేద నిరాసనమును ప్రబోధించిరి.

"స్వార్థమతప్రాశస్త్య, కులవైర సంభరితము
దీక్షితమమది వ్యాపించె దిక్కులందు"
"సమతలేనట్టి విమతుల సంఘమందు
వాసమున్ జేయ మదిలోన వాంఛలేదు"

"కరుణరసాన్విత కమనీయ రచనల నస్పృశ్యతాభావమణచె" ననియు, వర్గ వర్ణ ద్వేషవాసనా దూరమౌ గుణమె భూషణ మంచుఁగొలిచినాడనియు వీరు కవిని ప్రస్తుతించినారు, "వర్గ వర్ణ కార్తిర వైషమ్యములు లేక కార్మికులు మెలగు చున్నా"రని కుట్ర లను మెచ్చుకొన్నారు.

వీరికి నిష్కామకర్మ-కర్మయోగము మిక్కిలి అభీప్సి తము. అకర్మణ్యతను నిరసించిరి. "ధర్మపథానురక్తులై కాయము చెమ్మటల్ కరియఁగష్టమునోర్చుచు మాతృమం డల శ్రేయము గోరుచున్ బగలు రేయి ప్రయత్నము సల్పు" డనియు.

"ఆంధ్రుల కలయిక యంతరించెనటంచు
స్వార్థమ్మె యంతట సాగెనంచు
తెలుగు సోదరా! చింతింప ఫలము దేమి?
కార్యభారమ్ము వహియింపఁగదలి రమ్మ"అనియూ

వీరు పరిబోధించిరి.

నిష్కామకర్మనిరతులు, సాధుచరిత్రులునగు శ్రీ వేంకటనరసయ్యగారికి, అభినవతిక్కన బిరుదాంకితులు శ్రీ సీతారామమూర్తికవిగారు తమ "శబల"ను కృతినిచ్చి యాదరించుటెంతయు సమంజసము, మిక్కిలి స్తుతి పాత్రము, కృతినిచ్చుతఱి అభినవతిక్కన యిటుల బలికినాడు.

"...ఇతని జితేంద్రియత్వమున కేనుగరంగి కృతిప్రదాతనై సతతసుఖాయురున్నతి వశంవదదీవనలిత్తు పేర్మికిన్" అని

నిజముగా నీయన సాహిత్యము ఈయన జీవితమును వ్యాఖ్యానించుచున్నది.

ఈ రచనలు చేయుటలో శ్రీ వేంకటనరసయ్యగారి యుద్దేశ్యమేమి? వారు తమ "ఖండకృతి" లో కవి నుద్దేశించి యిట్లు ప్రబోధించినారు.

> "జాతికి శుభమున్ గూర్చుచు
> ఖ్యాతిని గలిగించునట్టి ఘనుల చరిత్రల్
> లిఖయింపవలయు"ను అని.

ఇందు దేశకళ్యాణము నిర్దేశితము. సత్యశివసుందరమైన రచనము మాత్రమే యశమును, మోదమును సమకూర్చు" ననియు వారు నుడివిరి. సంఘమును ఉత్తమ మార్గములో పయనింపజేసి లోకకళ్యాణకారియగునట్లు తోడ్పడవలసిన విధి" కవి కున్నట్లు "వ్యాసవాణి" యందు వెరుద్ఘోషించిరి.

కాన కావ్యప్రయోజనము దేశకళ్యాణము, ఉపదేశము, ఆనందము అని యీ కవి భావించినటుల కానవచ్చుచున్నది. ఆంగ్ల లాక్షణికులును "The purpose of the poem is to teach and delight" అనగా కావ్య ప్రయోజనము ఉపదేశము, ఆనందమునని చెప్పిరి భామహుఁడు కావ్యప్రయోజనము నిట్లు చెప్పినాడు.

> "ధర్మార్థ కామమోక్షేషు వైచక్షణ్యం కళాసుచ
> కరోతికీర్తిం ప్రీతించ సాధుకావ్య నిషేవణం" అని.

యశస్సును కావ్యప్రయోజనములలో నొకటిగా చేయ్పుటకు గొందఱంగీకరింపక పోవచ్చును. అది స్వార్థమనియు నిర్ధరింపవచ్చును. కాని యటులనుట సమంజసముకాదు. అటులైన 'ఆనందము' మాత్రమేమైనది? అందు స్వార్థపరత్వము లేకపోయినదా? కనుకనే యశఃకాముకత్వము నిరసింపరాదు. ఇది ఈషణత్రయములోచేరదు. పంచమవేదమన బరగిన శ్రీమదాంధ్రమహాభారత మిటుల ప్రబోధించుచున్నది.

> కీర్తిలేనివానికిని జీవనంబు ని
> రర్థకంబు సూవెయవని మీద
> నిత్యమయిన ధనము నిర్మల కీర్తియ
> యట్టికీర్తి వడయు టశ్రమంబె॥

శ్రీ వేంకటనరసయ్యగారి రచనలందంతటను ఉపదేశము- పరిబోధము, దేశకళ్యాణకాంక్ష- కానవచ్చుచునే యుండును.

వీరి ఖండకృతియందలి భాష స్వాదుమధురమును, సరళమునైయున్నది. శైలి ద్రాక్షాపాకము గలిగి సమతా ప్రసాద గుణములతో నొప్పారుచున్నది. సమతగుణమునకొక యుదాహరణము.

రాజాధి రాజుల రమణీయ కంఠాల
వసియింప మదియందు వాంఛలేదు
దేవాలయమ్ముల తిమిరమ్ములోపల
వసియింప మదియందు వాంఛలేదు.
కాంచనపూజయే కర్తవ్యమనుచోట
వసియింప మదియందు వాంఛలేదు

ప్రసాద గుణమునకొక మచ్చు :—

మంజుల మకరంద మాధుర్య భరితమౌ
మానసమ్మున మమ్ము మనిపినావు
జీవితాదర్శమ్ముఁ జేర్పింపజాలిన
విద్యలన్ నేర్పితి వేడ్కఁ దనర
ఆత్మ ప్రబోధమ్ము నశాంతమును దెల్పి
సాంఘిక ధర్మమున్ సలిపితీవు —

ఇందలి పద్యములనేకములు రసస్ఫోరకములుగను, భావోద్దీప కములుగనుండి మరల మరల పఠింపదగియున్నవి. పాఠకులపై దీని ప్రభావమవశ్యముండును. ఒక యుదాహరణము.

> కోరను యశమును, సుఖమును
> గోరను రాజ్యంబునెపుడు, గోరను ముక్తిన్
> గోరుదు, నార్తుల సేవను
> గోరుదు నా హృదయమందు క్షోణీహితమున్

వీరి పద్యములలో సీసములును, కందములును మిక్కిలి సొంపు గులుకుచుండును. క్లిష్టము పరుషము నెచ్చటను కానరాక సారళ్యముతోను, సారస్యముతోను రచన యొప్పారుచున్నది,

వీరి "నవగీతాలు" గేయ సంపుటి, ప్రబోధాత్మక ముగనున్నది. గ్రంథాలయము, వయోజనవిద్య, సైనిక శిక్షణ, స్వాతంత్ర్య దినోత్సవము మున్నగు నంశములిందు గలవు. కవియిందెక్కువ జాతీయములను వాడిరి. భావమునకు దగిన నడకను, అందుకుదగిన శైలిని కూర్చుటలో నీ కవి మిక్కిలి నేర్పరి.

మహాపురుషుల జీవిత చరిత్రలను విద్యార్థుల యుప యోగార్థముగ్రాసి, యీ కవి గొప్ప సేవ చేసిన వారైరి. "ఆంధ్ర సేవకుల" లో కా॥ నాగేశ్వరరావు, మా. అన్న పూర్ణాదేవి, కోడి రామమూర్తి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

గారల చరిత్రములున్నవి. ఇది చదువుచున్నవ్వాడు, తల్లీనతయు, భావావేశమును కల్గుచున్నవి. ఉత్తమాదర్శములవైపు విద్యార్థు లాకృష్టులై యుత్తమ పౌరులగుట కిట్టి రచనలెంతేని తోడ్పడగలవనుటలో నిసుమంతయు సందియము లేదు. ఇందలి వీరి వచన రచన మిక్కిలి మనోజ్ఞముగనున్నది. భావోద్రేకమును గలిగించు నుత్తమ ఘట్టములిందు చిత్రింపబడుటచే, పుస్తక మారంభించిన పాఠకుడు తుదివరకు జదివి ముగింపక పుస్తకమును విడువజాలడు. ఇట్టి యుత్తమ పుస్తకమును బాఠ్య గ్రంథముగ నుంచిననో విద్యార్థి లోకమున కెనలేని మేలొనగూడును.

"ఉత్తమ కథలు" ను అటులనే వీరేశలింగము, పట్టాభి సీతారామయ్య, తుమ్మల సీతారామమూర్తిగారల జీవిత చరిత్రములతో నెంతేనియు నొప్పుచున్నది.

"జాతీయ కథలు" రచనలో అబ్దుల్ గఫ్ఫారుఖాన్, (సరిహద్దు గాంధి) జయప్రకాశనారాయణ, అరుణ అసఫాలీల చరిత్రలు చిత్రింపబడినవి. "వైతాళిక కథల" లో శ్రీమతి విజయలక్ష్మి పండిట్, విప్లవయోగి అరవింద ఘోషు, మౌలానా అబుల్ కలాం ఆజాదుల జీవిత కథలున్నవి. "జాతీయ దసరా గీతములు" నిర్మాణముతో వీరు సారస్వత రంగమున నూతన మార్గదర్శకులు అయినారు.

ఈ కవి యింతటితో నాగక వయోజన శ్రేయముపై దృష్టిసారించి, వారి యుపయోగార్థము "వయోజన విద్య" యను నొక చిన్న పుస్తకమునుకూడ రచించిరి. పాఠముల చివర అనుబంధ రూపమున విద్యావశ్యకతను దెల్పునొక వ్యాసమును, వయోజన విద్యా ప్రాముఖ్యమును దేటపరచు పెద్దల యభిప్రాయములను, విద్యా మహాత్మ్యమును గొనియాడు పూర్వ కవీశ్వరుల పద్యముల గొన్నింటినిచేర్చి పుస్తకప్రయోజనమును ఇనుమడింపజేసిరి. వయోజనులకు దగినట్టులనే పుస్తకము పెద్ద యక్షరములలో నచ్చొత్తింపబడి సుందరముగ నున్నది.

శ్రీ వేంకటనరసయ్యగారవివాహితులు. బ్రహ్మచర్య నిష్ఠులు. తమ కాలమును, శక్తిని నిరంతరము సాహిత్యసేవకు వినియోగించుచున్నారు. ఉదారాశయ సంపన్నులు, గాంధీజీ యనుయాయులునగు వీరు తమ యాశయములను సాహిత్యము ద్వారా ప్రచారముచేసి కృతకృత్యులయిరని చెప్పవచ్చును.

వీరిట్టి యుత్తమ కృతుల నింకను వెలార్చి ఆంధ్ర సారస్వతమున కమూల్యసేవ జేయుదురు గాక!



# ధన్య జీవులు

ఐత్తురి వెంకటరామిరెడ్డి,
జేతాపల్లె, (వయా) గుత్తి, అనంతపురం జిల్లా.

కాంగ్రెసు విజయ నాటకము ఆనాడు పిన్నవయస్కులై జాతీయ ఉద్యమంలో పాల్గొన నోచని మా లాటి యువకులు, స్వాతంత్ర్య సంపాదనార్థమై ఆనాటి పెద్దలు ఏలాగుపాటుపడిరో తేట తెల్లముగా తెలుసుకొనుటకు చక్కగా తోడ్పడుతుంది, ఇందులో కాంగ్రెసు పుట్టుక మొదలు 60 సంవత్సరముల కాంగ్రెసు చరిత్ర సంగ్రహముగ సంవత్సరములతో సహా కన్నులకు కట్టినట్లు వివరింపబడింది. నాకు తెలిసినంతవరకు తెలుగులో ఇట్టి చారిత్రక నాటకము నేటివరకు వెలువడలేదని భావిస్తాను. సంస్కరణాంకము, స్వరాజ్యాంకము, ప్రజావిప్లవాంకము అను మూడంకములతో ముచ్చటైన పద్యములతో జాతీయగీతములతో నొప్పు ఈ నాటకమును రచించి, భావితరముల బాల బాలికలకు యువకబృందమునకు జాతీయ భావము రగుల్కొల్పుటకు ప్రయత్నించిన ఉభయ కవులు ధన్య జీవులు. డాక్టరు పట్టాభిసంటి నాయకుల ప్రశంసలందిన నాటక మిది.

ఆంధ్రపత్రిక ఇట్లు వ్రాసినది.

"ఈ రచయితలు ఇరువురు గొప్పపండితులు. దేశ భక్తులు, వీరి రచన–శైలి–పద్యాలు–గేయాలు హృద్యంగా గంభీరంగా ఉన్నవి"

ప్ర జా రా జ్య ము :—

ప్రభుత్వోద్యోగుల సహాయంతో పెత్తందార్లు సాగించు దౌర్జన్యమును, సంక్షుభావముతో ఎదుర్కొని పరిజాకంటకుల మనస్సులను కూడ మార్చవచ్చునని ప్రబోధించు నాటక రాజమిది, పాతపురాణ నాటకములతో విసుగుచెందిన ప్రజా నీకమునకు, క్రొత్తతేజస్సును, ఉత్సాహమును కల్పించి సామ్య వాద సమాజం వైపుకు పురోగమింప దారిచూపుచు రచయి తలు కష్టజీవుల త్యాగశీలాలను సాక్షాత్కరింప చేయటానికి పరియత్నించారు. తాము సంచరించిన పరిదేశాలలో కనులార గాంచిన విశేషాలను. ఆయా పద్య గద్యములందు పదిలపరచి పేరికకుల హృదయాలు ఉప్పొంగునట్లు చిత్రించారు.

పరిజాసామాన్యంలో తరచు ప్రయోగింపబడు సామె తలు జాతీయములు విరివిగా వాడి ప్రజలభాషలోనే నాటక మంతా నడిపించారు. ఉదా :- "కోర్టుకు పోతివో! కోలు పోతివో! ఇంట్లో ఈగలమోత బైట వల్లకీలమోత, రెంటికి చెడిన రేవడువలె, ఇరుక్కొడిన ఓక్కొడును." మొదలగు

తెలుగునుడులు ఈ రచన కొక యందమును చేకూర్చు చున్నవి.

పాత్రలన్నియు పుష్టిగా పోషింపబడినవి. పాత్రలచే పలికించిన కొన్ని మాటలు ప్రేక్షకుల హృదయాలలో శాశ్వతముగ హత్తుకొని పోగలవు. ఉదా :- "క్షమణ, నారదా సుతో మాట్లాడుచు..."మానవ శక్తికతీంచి సంభవించు సుఖ దుఃఖములుకొన్ని. మానవ నిర్మిత శాసనాలచే సంభవించు సుఖ దుఃఖములుకొన్ని" పుట్టుక చావులు మొదటి రకము లోనివి, అవి సహజములు. కాని కలిమి లేములు, స్వార్థపరులను కొందరు మనుష్యులచే సృష్టింపబడిన సాంఘికాచారములచే దాపురించినవి. అట్టి వానిని మనమన్నివిధాల ఎదుర్కొని సమత్వము నొందుటకు ప్రయత్నించవలెను"— అని చెపుతుంది, ఎంత చక్కని సలహా ఇది.

నేటి సమాజంలో ప్రతి మానవుడు ఎదుర్కొను, ప్రధాన సమస్య సాంఘిక దురాచారములే. అట్టి దురాచారములైన కులమత వర్గభేదాలను రూపుమాపి సమత్వమును సాధించుటకు రచయితలు యీ నాటకంద్వారా చక్కని మార్గం సూచించారు. ఈ నాటకం చదువదగింది. ప్రదర్శింపదగింది.

ఉపాధ్యాయుడు :—

సమాజంలో ఆచార్యుడని పేరొంది గౌరవస్థానము నాక్రమించవలసిన ఉపాధ్యాయుని నేటిదుస్థితిని హాస్యరసంలో

హృద్యమంగా వర్ణించారు. రచయితలు ఉపాధ్యాయులైయుండి స్వానుభవమున వ్రాసిన యీ ఏక పాత్ర నాటిక సమర్థుడైన నటునిచే ప్రదర్శింపబడినచో ప్రేక్షకలోకంలో ఉపాధ్యాయులపై సానుభూతిని సంపాదించగలదు.

జ య భే రి :—

నిర్మాణ కార్యక్రమము, జన్మభూమి, దేశభక్తులపై వ్రాయబడిన పద్యరత్నములు కంఠస్థములు చేయవలసినవి. నిజముగానిది జయభేరియే. రచయితలు తాము కన్నులార గాంచిన జాతీయ సమస్యల జాతీయ వీరులగూర్చిన పద్యరత్నము లిందుగలవు, "మణి నావలయంభాతి వలయేన మణి ర్వృథా" అనునట్లు రచయితలు స్వయముగా దేశభక్తులగుట చేతను పసిడికి తావి అబ్బినరీతిగా యీ ఖండకావ్య సంపుటి లోకారాధ్యమై సర్వజనాదరణీయమై శోభిల్లినది.

"శీర్షమా! ఉత్తుంగ శిఖరవంక్తుల నొప్పు, భువనేశ్వరీ దేవి పుట్టినిల్లు."— అను పద్యంలో మాతృదేశమును నేటి వరకు యే కవి వర్ణించని అద్భుత భంగిమలో చిత్రించి భారత లక్ష్మిని నవనవోన్మేష సుందర మూర్తినిగ చూపించారు. "కలవా లేవో యనంగను నాలుగు వరక, లాడుచుండెడి వట్టి జోడినెత్తి"... అను పద్యంలో గాంధీతాతను కన్నులకు కట్టి నట్లు వర్ణించారు.

“పప్పుధప్పళముకై పాకు పాకునికేతి, ఉప్పు చేయగ ముందుకురికినారు...” అను పద్యంలో స్వరాజ్య సమరమున కుహుకు దేశభక్తుల వర్ణించుచు చూపినసామ్యం సరళహాస్యంతో చక్కగా సాగి పాఠకులకైన తేలికగ అర్థమై హృదయానికి గిలిగింతలు కల్పిస్తుంది.

రాట్నలక్ష్మిని వర్ణించుచు-

ధనమాకాదన్ను, ధ్యాన్యమ్మాయుడుగు, స్వాతంత్ర్యంబ
చేకూరెడిన్
ఘనతాకల్లును, కామమాతలుగు, సౌఖ్యంబ్బాకడున్ వృద్ధియౌ
వినయంబా జనియించు ధైర్యరమయూ పుంపొందునింపొందగన్
మన మాధ్యాత్మిక చింతలోఁ దవిలి రాట్నంబున్ సదాత్రిప్పినన్

అను పద్యంలో రాట్నలక్ష్మినిపూజించిన రాగల లాభములు హృద్యమంగా చిత్రించారు. ఇందలి పద్యములన్నియు జాతి రత్నములే. ఈ ఖండకావ్యమును రచించి రచయితలు తమ లేఖినిని కృతార్థము చేసుకొన్నారు.

“చలో ఢిల్లీ” బుఱ్ఱకథ. ఇందు నేతాజీ సుభాసు చంద్రబోసు యొక్క జీవితము, బాల్యము మొదలుకొని సంపూర్తిగా గానము చేయబడినది. ఆయా సందర్భములకు తగినట్లు అన్ని రసములు చక్కగా పోషింపబడినవి. బోసు వీరుని పౌరుషము, సమర కుశలత చక్కగా చిత్రింపబడినది. చివరి కాంగ్రెసు ఎన్నికల పరిణాళిక రగడ, పద్య గేయాలు రసవంతములై యున్నవి.

సీ॥ అపహాస్యమునకైన అలుగులే ఎఱుఁగని
ఆజాదె భువి ధర్మరాజు గాఁగ
అన్నమాటను మీఱ కగ్నినైనను దూఁక
మఱియు పటేలె భీముండుగాఁగ
అపజయం బెరుగక అనుజాళి సేవించు
శూర జవ్హారుడె అర్జునుడు గాఁగ
అతి సమర్థతఁ జూపు అసఫాలి, రాజేంద్రు
లల నకుల, సహదేవులును గాఁగ
గీ॥ అమల జయశోభ నభిరామ మైన రాట్న
చక్రమును దివ్య గాంధియే చక్రి గాఁగ
భరత రాజ్యేందిరను హాస్తిపురిని నిలిపె
కనుడు కాంగ్రెస్సు భారతగాథ ఇదియ.

ఉత్తమ భావి పౌరులు కావలసియున్న మన విద్యార్థుల కీనాటి వాతావరణములో జాతీయ భావము, సత్ప్రవర్తన సేవా భావముల అలవర్చుట కిట్టి రచనల ఆవశ్యకత యెంతో గలదు. కాన ప్రతి పాఠశాలయందు ఈ రచయితల గ్రంథములు తప్పకయుంచదగినవి.

ఇప్పటి యభివృద్ధి కార్యములైన వరకట్న నిషేధము, సాంఘిక సమానత్వము మున్నగువాటిపై కావ్యములు రచించి జనుల సంతసింప చేయవలయునని ఈ కవివర్యులను ప్రేమతో అర్థించుచున్నాడను.

భగవానుడు ఈ రచయితలకు ఆయురారోగ్య ఐశ్వర్యములను ప్రసాదించుగాతఅని ప్రార్థించుచున్నాను.

"లోకాస్సమస్తా స్సుఖినోభవంతు"

# శ్రీ రాచమల్లు కన్నయ్య ధర్మ హాస్టలు

డా॥ వెంపటి సూర్యనారాయణ.

మీ జీవిత చరిత్ర నాకు తెలిసినప్పటినుండి మీతో కలిసియుండు అవకాశముల కొఱకు నా హృదయము ఎదురు చూచుచుండుట సహజమై పోయినది,

నిరుటికంటె యీ సంవత్సరము హెచ్చు సమయము మీతో గడపగలిగినందుకు చాల సంతోషించుచున్నాను.

అవునండి. మీరన్నట్లు హాస్టల్ జీవితము మీ సాధనకు హెచ్చుగా ఉపకరించినది. మీరు పొందిన మేలుకంటె విద్యార్థులు, పౌరులు పొందిన మేలు అనేక రెట్లు హెచ్చు. కాని దానివంక చూచుట మీవనికాదు. నిజమే. పౌరులలో నొకడనుగా భావించి చూచిన, ఆనందమునకు మేరయుండదు.



# సారస్వతము.

## శ్రీ వద్దెంపూడి హనుమంతరావు,

సంపాదకుడు: "మనో ప్రపంచం"

ఈయన ఉత్తమ పండితులేగాక ఉన్నత సంస్కారియు గూడా. వీరి కవిత్వమందంతట్లా జాతీయభావాలు సంస్కరణాభిలాష ద్యోతక మగుచునేయుండును. ఈ సందర్భములో శ్రీ ఆచార్య యన్. జి. రంగాగారు వ్రాసిన మాటలు గణింపదగినవి. "వీరొనర్చుచున్న సేవావ్రత మెంతో ఉత్తమమైనది. కైతకుగాదు వీరు శృంగార మొనర్చునది. సింగార మెరింగిన తమకై తను బీదలకై వారి బిడ్డల శుభమునకై ఆమె సేవకులకై శ్రామికుల కొరకై వారిని రక్షించు సాధారణ ప్రజలకై వినియోగించుచున్నారు. వీరు చేస్తున్న వసంతా జాతీయ విజ్ఞాన ప్రచారమందొక ఉత్తమ భాగముగా నెంచుకొన ప్రజల కందరకు నా మనవి."

వీరు ఉత్తమ భావుకులు, భావిపురోభివృద్ధిని ఆకాంక్షించే భావనాసంపన్నులు.

"గనుల శోధించి లాభముల్ గాంచవలయు
విద్య విజ్ఞాన సంస్కృతుల్ వెలయ వలయు
భూమి, దున్నెడి రైతులే పొందవలయు
సామ్యవాదమే లోకాన సాగవలయు"

అని వీరి "ప్రజారాజ్యము" అను నాటకమందు 1947 లోనే రాబోయే కాలాన్ని గూర్చి కలలుగన్న కవి యీతఁడు.

"కొందఱు భోగ భాగ్యములకున్ సరదార్లయి కుల్కుచుండఁగాఁ
గొందఱు కూడు గుడ్డలకుఁగుందుచు నుందురు దైన్యరాసులై
యందఱు నొక్కరూపమున హర్షమునొందుచు గానిపింపరీ
చందమదేల కల్గెనను శంకకు నుత్తరమెవ్వఁ డిచ్చునో."

యని విశ్వమునే ప్రశ్నించును. ఉన్నత భావస్ఫోరకములైన ఇట్టి పద్యముల నెన్నిటినో వీరి కృతులనుండి గ్రహింపవచ్చును.

శ్రీ శాస్త్రివారు నిరాడంబర జీవనులు, గుణాధికులు, వారితో నాకు 1954లో గణపవరంలో జరిగిన గుంటూరుజిల్లా సాహిత్యమహాసభల సందర్భములో తొలిసారిగా పరిచయం గలిగినది. తొలిచూపులోనే వారియందు నాకు గౌరవ మమకారములు ఏర్పడినవి, ఎవరినైనా ఒక్కసారి పరిచయంతోనే తనవైపు ఆకర్షించుకోగల ఆధ్యాత్మిక శక్తులు వారియందు నిబిడీ కృతమైయున్నవి. ఇంద్రియములను నిగ్రహించి, శీలసంపదను పెంపొందించి తమ శక్తినంతనూ, సారస్వతారాధనకు ప్రజాసేవకు అంకితం చేయుచున్న పండితులువారు.

# గురుదక్షిణ

వి. కొండయ్య, B.A.

జీవితానికి విలువను లేనేకులు అనేక విషయాల్నిబట్టి ఇస్తారు. నేను మాత్రం ధనాన్నిబట్టి ఇవ్వను. విద్యనుబట్టి కూడా కాదు. ఎందుకంటే కొంతమంది విద్యాధికుల్ని మానవ శబ్దావాచ్యుల్ని నే నెరుగుదును. కేవలముశీలాన్నిబట్టియు కాదు. ఏలయన, గోవు, పాషాణము శీలవంతములయ్యు నిష్ప్రయోజకములు. మేధాశక్తి, విద్య, శీలము– ఈ మూడింటి సమన్వయాన్నిబట్టి నేను జీవితానికి వెల కట్టెదను. అందువలననే నా మనో రాజ్యంలో మీ కొక విశిష్ట స్థానం, కళాశాలోపన్యాసకులకు గూడ లభింపని యున్నతస్థానం ఉన్నది.

మీ గ్రంథాల్ని చదివి జీర్ణించుకొని అట్టి గ్రంథాల్ని మీ శిష్యులు వ్రాయగలుగుటయే మీకు తగిన గురుదక్షిణ, ఋషి ఋణం తీర్చటానికి పెద్దలు చెప్పిన మార్గమూ ఇదే. ఆ మార్గంలో వెళ్లటానికి యథాశక్తితో కృషి చేస్తాను.

ఆ ప్రశాంతవదనము, ఆ నిరాడంబర జీవనము, కష్టములనెడి పర్వతములను చీల్చుకొనిపోగల వజ్రమువంటి శీలము. ఆ సౌజన్యమూర్తిని నామనఃఫలకమున సువర్ణాక్షరములతో చిత్రించుకొంటెని.

సెలవు.

# పద్య కుసుమములు

బ్రహ్మచర్య దీక్షాదక్ష పరమయోగి
చంద్రములకు సాటివచ్చు తేజంబుగ్రాల
ధ్యాన నిష్ఠాగరిష్ఠ విద్యా పరిబుద్ధ
కావ్య గానంబు సలుపుమా, కవివరేణ్య!

అనుమ భవాదృశుల్ సుమధు రాంధ్ర కవీశులు భవ్యనవ్య సుం
దరకృతు లన్ని తాకృతులు దర్పమెలర్ప రచించినట్టి నీ
నకు లసదెంచుటన్ ముద మపారము గాఁగనె పాత్రశాలయో
సరస కవీంద్ర, శాస్త్రికుల చంద్ర, మహాశయ, వేంకటనర్సయా!

స్ఫుటతర భావబంధురము పూర్ణసుధాకల శోభమానమున్
చటులము నిత్యనూతనము జాను తెనుంగు సుసంస్కృతంబునై
జటిలముగాక నీరచన శాస్త్రికులార్ణవచంద్ర! యొప్పు వేం.
కటనరసయ్య, నీమధురకంఠము మాకొసగున్ ప్రబోధమున్.

బ్రహ్మచర్యనిష్ఠ ప్రవిమల సత్యోక్తి
దేశభక్తి, సాహితీపరిసక్తి,
వృజినరహిత వృత్తి, సుజన సేవాసక్తి
శాస్త్రి వేంకటనరసప్రశస్తి॥

ననలుదొడగిన తీవయై నవ్యకవిత
నీమతాజాకలాన నిర్నిద్రతేజ
మొలుకుచున్నది జిలిబిలి పలుకులకును
కమ్మనెత్తావియెసఁగుచుఁగవి వతంస॥

— విద్వాన్. వంగవోలు ఆదిశేషయ్య, బి, ఏ.

కటికతనమ్ములేని కలకండలు–జాను తెనుంగు ముద్దుము
చ్చటలు–సమగ్రబోధ సరసమ్ములు ఖండకృతుల్ రచించి ది
క్తటములఁగీర్తి చంద్రికల కమ్మదనమ్మొగవోయు జాస్తి వేం
కటనరసయ్య సత్కవి శిఖామణి ! మీకు జయాభివాదముల్॥

— బీర్నీడి విజయదత్.

సిరులీను పసిడివల్వను
ధరియించు జనార్దనుండు దయతోడన్ నిన్
గరుణించుగాత వేంకట
నరసయ్యకవీంద్ర! ఘనవినయగుణసాంద్రా!

మంచికవిత్వధోరణి సమంజసభావము విశ్వసంస్తుతో
దంచిత శాంతవృత్తి కడు త్యాగముగల్గి సుకావ్యరాశి గా
వించి త్రిలింగమాతకు నివేదనజేసి యఖండకీర్తి నా
ర్జించితివయ్య! జాస్తికుల శేఖర ! వేంకటనర్సయాహ్వయా!”

స్వార్థపరత్వమున్విడి ఉదారస మొప్ప కవీశ్వరోపకా
రార్థము సత్కృతి ప్రచురణార్థము దేశహితార్థ మార్యసే
నార్థము క్షేమిచే నహరహంబు శ్రమంబు వహించునట్టి వి
ద్యార్థుల రక్షణార్థము వ్యయంబొనరింతువు స్వార్జితార్థమున్॥

మధురంపు సుకవితాసుధకు గాంగర్ఝరంబు
హృద్యమైయొప్పు నీ కృతిచయంబు
భాషీయభావ దివ్యతరంగతతికి మ
హావార్ధి నీ హృదయాలయంబు
పరమపండిత కవిప్రకరంబులకు సౌర
నందనవాటి నీ మందిరంబు
గీర్వాణితామణికి విశాలనాట్యని
కాయంబు నీముఖగహ్వరంబు
సతతసాహితీ కార్య దీక్షాపరుడవు
క్రోధమాత్సర్యములులేని కోవిదుడవు
'చిరతరాయుష్యమస్తు' జాస్తికుల నీకు
నవ్యగుణధుర్య! వేంకటనరసయార్య!

భరతరాజ్యోపలబ్ధికై తిరము శాంతి
రణముగావించి చెరసాలవనట జెంది
దేశభక్తులచే వినుతింపబడితి
వనఘనీకు చిరాయుష్యమగునుగాక॥

— 'కవిచంద్ర' శ్రీ కన్నెగంటి చినలింగాచార్యులు.

వింటిని బుద్ధిశాలివని, వీనుల విందుగ నట్టివైఖరే
గంటిని మీయెడన్; మహిత, కావ్యకళానిధి! మీకవిత్వపున్
బంటుతనంబు తెల్గున క, పార బలంబిడి శారదాంబ క్రే
గంటి కటాక్ష వీక్షణలు, గ్రమ్మత (శ్రీ) నరసింహ సత్కవీ॥

పరిమితి దప్పకుండ నవ, భావ పరంపర లొప్పుచుండ, వ్యా
కరణ సుసిద్ధమార్గముల, గౌరవమున్ సమకూర్చి ధీమతుల్
పరిచితమైన సంతస మ, పారముగన్ గొనునట్లు వ్రాసితో
స్థిర తరశైలిమై సుకవి, శేఖర జాస్తికులైకభూషణా॥

పరమ పావనమైన మీ, భావమునకు
సంతతా నందమును ముక్తి సాధనంబు
నిశ్చలారోగ్య మొనగూర్చి. నియతిమీర
బ్రోచుగావుతహరి, మహాపూర్ణ కరుణ॥

— శతావధాని. కల్లూరి శేషగిరిరాయకవి,

పద్యంబు నడకను బరికించి చూతుమా
హృద్యమై మించును గద్య రచన
గద్యంబు బిగువును గాలించి చూతుమా
హృద్యమై మించును బద్యవితతిఁ
బద్య గద్యంబుల భావించి చూతుమా
భావంబు లొండొంటఁ బరువులెత్తు

భావంబు లోకమాఱు పనిగొని చూతుమా
శైలి తనంతనే సాగి చనును
శైలి నొకసారి చూతుమా సకలరసము
లుప్పతిల్లుచు నుండును గుప్పలుగను
అప్పుర! నరస సుబ్రహ్మణ్య కవుల కలము
దేశభక్తిని జాటుచుఁ దేజరిల్లు॥

— పండిత పెనుమెచ్చ సత్యనారాయణరాజు.

మితభాషికాని మారుతము పూచెడివాణి
రసరాజ్యమేలెడి రాజధాని
నిర్లిప్తుఁడేకాని సిర్లు పొర్లెడి షహాని
వెల్గెడి సాహిత్య విశ్వజాని
హాలికుఁడేకాని పాలకుడెంతేని
తన్నెడి దివ్యశతావధాని
చురుకు చూపడు కాని గురుదేవు డీక్షోణి
కడిది దొడ్డకు మెచ్చబడెడి జ్ఞాని

పుట్టినది పెదపూడి కాపురముకాదు
పేరమన్న చిలకలూరిపేట సుమ్మి
పౌరుషంబునకిక జాస్తి వంగడంబు
సరసుడైన నరసకవి పురుషధనుడు

అదిగో ఆడము పీరు సాహెబులు శ్రావ్యంబైన సన్నాయి కో
విదులై కోయిల రాగడోలికలతో విద్వజ్జనాఖండల
పరిద సమ్మోద మహోఘన ద్విరద శౌర్య శ్రీ విలాసైక నీ
రద కాంతారము కుల్కు జాస్తి కవి ధీరత్వమ్ము శ్లాఘించెగా

— జగజ్జనని శ్రీ వేదాంతకవి,

తమయున్నంపిన యారు పొత్తములు మో । దంబందుచు
న్మేముసాం
గముగాఁ జూచితిమింపుఁగుల్కు రసముల్ । శ్రమోజ్వలాలం
కృతుల్
రమణీయంబగు శైలి వర్ణనలు గీ । ర్వాణాంధ్ర భాషాసమ
గ్రములై వేంకట నర్సయాఖ్య కవి వ । ర్యా! గారిలుఁదద్గ్రంథ
ముల్ –

ఉ॥ ఎటుల జనించెనో తమకు।నిట్టి సుధామయమౌ కవిత్వమె
చ్చటఁబరికించి గన్గొనిన జల్లిపదంబులుఁ గానరాక మి
క్కుటముగ నన్ని వర్ణనలు గ్రంథములందలరారె జాస్తి వేం
కట నరసయ్య మీ యశము ఖండముగా వెలుఁగొందు
దిక్కులన్ –

— శ్రీ బొల్లి వెంకయ్య. శ్రీ జవ్వాజి వెంకయ్య

చలనం బందని భావసంపదలతో జాతీయ తత్వమ్ముతో
కలమున్ జేత ధరించి నిల్చితివి దీక్షాకంకణమ్మూని-యు
జ్జ్వల మేధావివి శాంతమూర్తివి, కవీంద్రా! దేశభక్తుండవై
తెలుఁగున్ గడ్డకుఁ గీర్తిదెచ్చితివి, సందేశమ్ము లర్పించుచున్॥

దేశము నుద్ధరించుటకు దీక్షధరించి మహాత్ముఁడిచ్చు సం
దేశమునంది వేడ్కనుపదేశములిచ్చుచు నవ్యభారతీ
యాశయముల్ సుకావ్యముల నందగఁజేయుచు రైతుబిడ్డవై
శ్రీ శుభముల్ వెలార్చితివి చిన్నలు పన్నలు గుల్లుపల్లులన్॥

నిరుపేద విద్యార్థులలుకు చెందెడి వేళ
నాదరించినది నీ హస్తయుగము
దీనాత్ములగుచు చింతిలు కళాకారులన్
పాలించుచుండు నీ జాలిచూపు
దేశోన్నతులకు సందేశ కార్యంబులన్
ప్రకటించు నీ గద్య పద్య రచన
గ్రంథాలయాది సత్కార్య క్రమంబులన్
తిరుగాడుచుండు నీ ధీ బలమ్ము॥
అభ్యుదయ రేఖలను పొంది యహరహంబు
గాచుకొనియుండు నీదు నిష్కామసేవ
ధన్యయయ్యెను నీ కావ్యకన్య నేడు
శాస్త్రి వేంకటనరసయ్య సత్కవీంద్ర॥

— శతావధాని శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు.

ఇంచుకయేని లోకవట మెంచక కన్నకుమారు మాడ్కి_మ
న్నించి సుసేవ్య మంజులకవిత్వపటుత్వ మహాత్వసంపదన్
అంచితరీతి నాకొసగిహర్షముజెందు కవీంద్రుగొల్తునే
మించినవేడ్క జాస్తిగృహామిత్రుని వేంకటనర్సయార్యునిన్॥

మానవాభ్యుదయ సాధన మదీప్సితమనుచు
చెలగిదీనులచెంత జేర్చినాడు
భరతమాతకు ముద్దుపట్టి మహాత్ముని
యడుగుజాడలలోన నడిచినాడు
స్వాతంత్ర్య దీక్షైకసాధు చిత్తముబూని
పలుమారు జైలున వరలినాడు
ఆమ్నాయములకైన అందరాని ఫలమ్ము
యింపుమీరగ గడియించినాడు

సదమలంబైన భావాలవదిలవరచి
తేనెసోనల చిలికించు తెనుగుకవిత
కావ్య నిర్మాణకర్తయై ఘనయశమ్ము
జెంది విలసిల్లు జాస్తి నృసింహసుకవి

— షేక్ ఆలి.

శ్రీ జాస్తి వంశ పాదో
ధీ జనితసుధాకిరణ! సుధీమంగళమూ
ర్తి! జాతీయ కవీంద్రా!
నీ జాలియెదకు ప్రణతుల నిచ్చెద నెపుడున్॥

వేంకట నరసయ సత్కవి
శంకర - విద్వన్నికరవసంతా! సత్యా
లంకరణ సుగుణ భూషా
లంకృత సద్వాగ్విలాస! లలిత కవీశా॥

శాంతస్వాంతకవీశునిన్ ఉభయభాషాపట్టభద్రాంచితున్
స్వాంతంబందున నెప్పుడున్ పరులకై సద్భావనల్ జేయు ధీ
మంతున్ జన్మభువిన్ కళానిలయు నా బాపూజి భక్తాగ్రణిన్
అంతర్భక్తిదలంతు మద్గురువరున్ ఆనంద స్వామాత్మునిన్।

—"ఆంధ్ర విశారద" శ్రీ పెదపాటి నాగేశ్వరరావు.

భారత జాతి దాస్య విముక్తికై
కారా గృహమున వసియించితివి
పరులసేవకై దేశభక్తితో
కష్టాలెన్నో అనుభవించితివి॥

సరస్వతిని "మాంపాహి" యటంచు
స్తుతియించే ఓ పరమపూజకా!
భరతదేశమున వివిధప్రాంతముల
పర్యటించిన పవిత్ర మూర్తీ!

శిష్య బృందమునకు చేయూతనొసంగి
ఆశీస్సులతో భాసిల్ల జేసితివి
కవీశ్వరులుగా - కవయిత్రులుగా
భావి భారత శ్రేయస్కులుగా

గర్జనజేసే సింహామువలెనే
గంభీరవాక్కులను మండపములపై
ఉపన్యసించుచు ప్రజాహృదయముల
విలీనపరచే మజా హృదయమా!

నీ హృదయములోని కలవరమంతా
కరగించితివయ్యా కావ్యంబులలో
హీనుల దీనులబాధలన్నియును
బాధాక్రాంతుల ఆక్రందనలను

బాధాక్రాంతుల ఆక్రందనలను
విచిత్రముగా చిత్రించితి వీవని
సత్యం, దానం, శాంత పరుడవని
కొనియాడెను నిను పత్రికలెన్నో!

సర్వకులమత సహాకారమునకై
పయోజన విద్యా వ్యాపకమునకై
గ్రంథాలయముల స్థాపనకొఱకై
దీక్షబూనితివి - సంఘసేవకా!

కవితావరులను కళారాధకుల
నుచితరీతుల - సత్కరించుచూ
కళారాధనలో - కవితబోధనలో
కాలముగడిపే పండితవర్యా!

జాస్తి వంగడపు కవితామాన్య
వేంకటనరసయ్యా! పండితవరేణ్యా
వందనమయ్యా మా గురువర్యా!
అందుకొనుము నా "అంజలి" పత్రం.

— గేయకవి. శ్రీ కొప్పోలు వేంకటేశ్వర్లు.

ఏశక్తుల్ తనకున్న నేమి పురుషుం డెబ్బంగి రాణించు నీ
యాశీర్వాద బలంబు లేనియెడ నంబా! యుష్మదీయార్చనా
వైశారద్యము గోరువాఁడితఁడు నీ వాత్సల్యసంపత్తిలో
లేశం బీతనికిమ్ము పాలు; కవితా లీలారతీ! భారతీ॥

భారతంబును బల్కు పనిఁబూని తిక్కన్న
పసిఁడిగంటము కేలఁ బట్టునాఁడు
వేదభాష్యముఁ జెప్పు వేడ్క విద్యారణ్యుఁ
డోంకారమును వ్రాయుచున్ననాఁడు
దిగ్జయాపేక్ష సంధిల్ల రాయలు విజృం
భించి దుందుభి మొరయించునాఁడు
సాంఘసంస్కరణ దీక్షాకంకణంబును
రెడ్డి వేమన్న ధరించునాఁడు
వారల కొసంగినట్టి దీవనల నిచ్చి
వారలంగన్న కంట నింపారఁగాంచి
యాదరింపఁగదమ్మ నిన్నాశ్రయించి
యంజలి ఘటించుచున్నాఁడ నాంధ్రజనని!

— బాపూజీ ఆత్మకథ.

# జీవితచరిత్రసంగ్రహము

శ్రీ జాస్తి వేంకటనరసయ్యగారు 1910వ సంవత్సరము ఆగష్టు 2వ తేదీన గుంటూరు జిల్లా; తెనాలి తాలూకాలోని, "పెదపూడి" గ్రామమునందు జన్మించిరి. తల్లి శేషమ్మ, తండ్రి సుబ్బయ్య. తండ్రి ఆధ్యాత్మిక విద్యావేత్త, గొప్ప పౌరాణికుడు, కర్మయోగి. వారినిగూర్చి "బాపూజీ ఆత్మకథ" అను పద్యకావ్యములో అభినవతిక్కన తుమ్మల సీతారామ మూర్తిగారిట్లు వ్రాసిరి.

"ఈవిధి నాంధ్రవాణి భజియింపగ నాకు నెవండుముందరన్
ద్రోవల నెల్ల జూపి కడుఁదోడ్పడె నగ్గురువర్యు సాహితీ
శేవధిఁదత్త్వ విన్నికర శేఖరు భూరియశోవిభాసి మా
బావనుగొల్తు "జాస్తి"కుల పావనుఁజల్లయ సుబ్బయాఖ్యునిన్ ॥

వీరి తల్లి బాల్యమునందునను తండ్రి 1951 జూలై 31వ తారీఖునను దివంగతులైరి. వీరిని మాతామహి చెంచమ్మ పెంచెను. శ్రీ వేంకటనరసయ్య రేపల్లెతాలూకా "కావూరు" గ్రామమున మేనమామల గృహమునందుండి మాతృభాషను అభ్యసించిరి. తరువాత "అమృతలూరు" సంస్కృత పాఠశాలలో పంచకావ్యములను పఠించిరి. విద్వాన్ శ్రీ నాగలింగం

వేంకటేశ్వరశాస్త్రిగారు వీరికచట గురువులు. వీరు విద్యార్థి దశలో గాంధీ మహాత్ముని శంఖారావమును విని విద్యాలయమును విడచి 1930 వ సం॥ మే 17 వ తారీఖున ఉప్పుసత్యాగ్రహమునందు పాల్గొని, ప్రభుత్వ శిక్షితులై తంజావూరు బోర్టలుస్కూలుకు పంపబడిరి. 1933 సం॥ డిసెంబరు 19 వ తారీఖున బందరులో గాంధీమహాత్ముని దర్శించిరి. తమ జీవిత లక్ష్యసాధనలో వారి ఆశీర్వాదములను బొందిరి. పట్టాభి, ముట్నూరిగార్లవద్ద దేశసేవా శిక్షణనుపొందిరి. చిట్టిగూడూరు లోని నారసింహ సంస్కృత కళాశాలయందుఁ జదివిరి. శ్రీ మత్తిరుమల గుదిమెళ్ళ వరదాచార్యులు, శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి, శ్రీ కొల్లూరి సోమశేఖరశాస్త్రిగార్లు వీరి గురువులు. 1935 వ సం॥న ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి ఉభయ భాషా ప్రవీణ "A" పరీక్షలో ఉత్తీర్ణులై ఉన్నత పాఠశాలా పండితులైరి. వీరి తమ్ముడు సూర్యనారాయణ గారుయం.ఏ.పట్టభద్రులు. భాషాప్రవీణులు.శ్రీ నరసయ్యగారు కొంతకాలము వినయాశ్రమమునందు కార్యకర్తలుగానుండిరి. తరువాత హైస్కూలు పండితులై ఆ పదవిని వదలి మరల 1942 ఆగష్టు ఉద్యమమందు జేరి సెప్టెంబరు 20 వ తారీఖున శ్రీకృష్ణ జన్మస్థానమున కేగిరి. మూడు సం॥ కారాగార వాసములో హిందీని బోధించుట, గ్రంథ పఠనము, యోగాభ్యాసము, రచన, వీరికి నిత్య కార్యక్రమములయ్యెను. 1944

జూన్ 10 న బళ్ళారి ఆలిపూరు క్యాంపు జైలు నుండి విడుదల పొందిరి.

1945 వ సం॥ జూలై 24 నుండి గుంటూరు జిల్లా చిలకలూరిపేటయందు నేటి ఆర్.వి.యస్. సి.వి.యస్. హయ్యరు సెకండరీస్కూలునందు మరల ఉపాధ్యాయ పండితులైరి. వీరు 1955 డిసెంబరు 22న తారీఖున గుంటూరునందు శ్రీ ఆచార్య వినోబాగారిని, 1956 సం॥ మే 27 వ తారీఖున న్యూ ఢిల్లీయందు శాంతిదూత శ్రీ జవహర్లాల్ నెహ్రూగారిని, 1959 వ సం. ఆగస్టు 24 వ తేదీన వినయాశ్రమమందు శ్రీ బాబూ రాజేంద్ర ప్రసాదుగారినిజూచి వారి ఆశీర్వచనములను బొందిరి. దేశభక్తిపూరిత హృదయులై విజ్ఞాన సముపార్జనాయత్తచిత్తులై వీరు భారత దేశమునందు, కాశ్మీరు దేశమునందుఃబర్యటించిరి.

గ్రంథాలయోద్యమమునందు వీరికి ప్రీతిమెండు, కొంతకాలము గుంటూరు జిల్లా గ్రంథాలయ సంఘమునకు సహాయ కార్యదర్శిగానుండిరి. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు కొంతకాలము సహాయ కార్యదర్శిగా నుండిరి. నేడు ఆంధ్రప్రదేశ గ్రంథాలయసంఘమున పాలకవర్గసభ్యులుగానున్నారు. "గ్రంథాలయ సర్వస్వము" సంపాదకులలో వీరును ఒకరు. ఎన్నో గ్రంథాలయములను స్థాపించిరి. గ్రంథాలయ వార్షికోత్సవాదులలో బాల్గొని చక్కని సందేశములనిచ్చుచుందురు. వయోజన విద్యయన్న వీరికి అభిమానము మెండు. గ్రంథాల

ద్యమముపై గేయములు పద్యములు పెక్కు రచించిరి. వీరు పెక్కు సాహితీసభలలో ఉపన్యసించుచు సన్మానములను, సన్మాన పత్రములను పొందుచుందురు. నాటకములు, ఖండ కావ్యములు, గేయములు, గీతములు, వ్యాసములు, కథలు, జీవితచరిత్రలు, బుఱ్ఱకథలు మున్నగు పెక్కు జాతీయ భావ ములతో గ్రంథములను చాల రచించి ప్రచురించిరి.

## సన్మానపత్రము

1959 వ సం॥ జూన్ 13 న తారీఖున నరసరావుపేట తాలూకా బొప్పూడి పంచాయతీబోర్డువారు శ్రీ వేంకటనర సయ్యగారికి తమ గ్రంథాలయ నూతన భవన ప్రారంభోత్సవ సందర్భమున సమర్పించిన సన్మానపత్రము.

దేశసేవకా!

మీరు భారతమాత దాస్యశృంఖలముల విడిపింప పరితినబూని ప్రయత్నించి ఉపన్యాసము లిచ్చుచు మాతృదే శపు స్వాతంత్ర్యోద్యమములందు పాల్గొని కారాగారవాసాది శిక్షల ననుభవించితిరి. నేడు స్వతంత్ర భారత దేశమున పూజ్య బాపూజీ అడుగుజాడలలో నడచుచు, గ్రంథాలయోద్యమ పరిచారకులై కృషిచేయుచున్నారు. మీకు మా హృదయ పూర్వక స్వాగతము.

మధురకవీ !

దేశభక్తిపూరితములైన మహోన్నత భావజనకములైన రచనలను పెక్కింటిని రచించి మీరు పండిత పామరుల మన్ననలకు పాత్రులై సారస్వత ప్రపంచమున విశిష్టస్థానమును గడించి భారతీ కటాక్షవీక్షణముల వర్ధిల్లుచున్నారు. మీ సాహితీసేవ ఇతోధికముగా ఆంధ్రికి లభించుగాక.

ధన్యజీవీ !

అనితరసాధ్యమైన అఖండ బ్రహ్మచర్య వ్రతముతో మానవ సేవయే మాధవసేవ అను నార్యోక్తి ననుసరించి మీరు ఆదర్శ జీవిత పథమున నడచుచున్నారు. దారిద్ర్యసాగరమున మునిగి దరిగానక తపించు కవిపుంగవులను, కళారాధకులను సన్మానించుచు భాషాయోషకు సేవచేయు ధైర్యమును వారికి కలిగించుచున్నారు.

పండిత మహాశయా !

తమ విజ్ఞాన విద్యాజ్యోతిచే విద్యార్థిలోకమునకు మార్గమును చూపి విద్యాబోధనానుభవమున కవులను రచయితలను సృష్టించుచున్న మీరు ధన్యులు.

కర్మయోగీ !

భగవానుడు మిమ్ముల నాశీర్వదించుగాక. మా నూతన గ్రంథాలయ భవనమునకు ప్రారంభోత్సవముచేయ మిమ్ములను గోరుచున్నాము.

13—6—59 }
బాపట్లాడి. } ఇట్లు,
బొప్పూడి పంచాయతీ బోర్డు.

## స్వాగత పత్రము

ప్రియతమ గురువరేణ్యులు, ప్రజాసేవాధురంధరులు, సాహిత్యసేవయే తమ జీవిత పరమావధిగబెట్టుకొన్న శ్రీ జాస్తి వేంకటనరసయ్యగార్కి హృదయపూర్వకాభి వందనములతో సుస్వాగత మొసగుచున్నాము.

ప్రజాసేవకా !

మీరు 1930 లోనే కళాశాలా జీవితమునకు స్వస్తి చెప్పి స్వాతంత్ర్య పోరాటమున గాంధి మహాత్ముని పిలుపు నందుకొని, అఖండమైన సేవ మొనర్చి, పలుమారులు శ్రీకృష్ణ జన్మస్థానమును చేరుకొనిరి. పరిపరివిధముల కష్టములకులోన య్యు, వానిని సరకుచేయక, రాజకీయ జీవితముగడపిన మీ కృషికిదే మా హృదయపూర్వకాభి వందనములు.

కవివరేణ్యా !

మీరునుడువు కవనమును పండిత పామరులు సులభముగా గ్రాహ్యము చేసికొనగలరు. అది సమాజమును మార్చుటకు, సంఘమునందలి అవకతవకలను రూపుమాపుటకు ఎంతయేని ఉపయుక్తముకాగలదు. అందుకు నిదర్శనముగా మీ "ఖండ కృతి" యందలి కర్షకుడు, ఉపాధ్యాయుడు, చిత్రకారుడు మున్నగునవి చదువరులకు చదువ, చదువ అమితోత్సాహ మును కలుగజేయుచున్నవి.

దయానిధీ !

మీరు గడపిన ఆశ్రమజీవితములు ఎంతయేని కొని యాడదగియున్నవి. నిరాడంబర జీవితమును గడపుచు పెక్కు

మంది పేద విద్యార్థులకు మీరు చేయు సహాయమును వేరుగా జెప్పనవసరముండదనియే భావింతుము.

మీరు గ్రంథాలయములకు పలురూపములుగా విరాళ ములనొసంగి వాని యభివృద్ధిని కోరుచున్నారు. అట్టి మీ త్యాగబుద్ధికితోడుగా మీకు భగవానుడు తగిన జనమును, జీవమును నొసంగి కాపాడవలసినదిగా ప్రార్థించుచున్నాము.

రా జా పే ట } ఇట్లు,
14-11-1959. } తాలూకా చేతివృత్తుల సంఘం,



శ్రీ జాస్తి వేంకట నరసయ్య

# పెద్దల భావములు

సారస్వతం ఒక్కటే సంక్షుభిత మానవకోటికి దారి చూపగలిగింది. సాహితీవేత్తలు విశ్వైక్యతను సాధించాలి. ఈ తరంలోని సంక్షుభిత మానవకోటికి ఆశారేఖను చూపగలిగే బాధ్యత సారస్వతంపైనే కలదు. రాజకీయాలు, ఆర్థిక విషయాలు, మతసిద్ధాంతాలు స్వయిత్వం ప్రజలను వేరుచేయగా పరిచార రహితమైన సారస్వత మొక్కటే ప్రజలను ఏకం సుసంఘటితం చెయ్యగలదు. చరిత్రలోని కల్లోల ప్రవాహాన్ని దాటించి శాశ్వతత్వానికి మన దృష్టిని మరల్చగల శక్తి సాహిత్యానికి ఉన్నది. మత ప్రాంతీయ వర్గ కక్షలతో సంక్షుభితమైఉన్న ఈయుగంలో స్వల్పవిషయాలపైనే శక్తులన్నీ వృధా చేస్తున్న ఈ తరంలో సాహితీవేత్తలే దేశ సమైక్యతనే కాక ప్రపంచ సమైక్యతనే ప్రబోధించటం అత్యావశ్యకం. బాధాతప్తులైన మానవకోటి ఆక్రందనాలను సాహితీ కళాకారులు పెడచెవిని పెట్టలేరు. వీరు భారతదేశ ప్రజలకు సౌభాగ్యజీవితం సాధించటానికి కృషిచేయాలి. రచనలు సాగించాలి. కలం నడిపించాలి. సత్యం, శివం, సుందరం - వీనిని మనం గుర్తించక పోతే అనాగరికపు లోతులలో పడిపోతున్నామన్నమాటే.

సాహిత్యం సమకాలిక జీవితంతో సందడించినప్పుడే సజీవమౌతుంది. అత్యంత శక్తిమంతములైన యుగ ధర్మాలు సాహిత్యంలో తొణికిసలాడాలి. అప్పుడే అది సమాజానికి హృదయస్థమౌతుంది.

ఉదాత్తమైన ప్రతిసాహిత్యహృదయంలోను మనస్సును ఉత్తేజితులూగించే దివ్యభావన, విజ్ఞాన ప్రదమైన కాంతికళిక, శాశ్వత పదార్థావబోధం, వాస్తవప్రపంచంపై దాని ప్రభావం గోచరిస్తాయి.

ఆంధ్రకు వెయ్యేళ్ల చరిత్రఉన్నది. సమకాలిక ఆంధ్ర సారస్వతంలో ఆధునికభావాలు ప్రతిబింబిస్తున్నవి. అందుచేత అది సజీవమైనది. వాస్తవమైనది.

ఆంధ్ర భూమినుంచి ఆంధ్ర సాహిత్యం ఉద్భవించినా దాని ఆశయం విశ్వకళ్యాణం.

— శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ. (ఉపరాష్ట్రపతి)

చిత్తశుద్ధి సృజనాత్మకత లోపించిన రచనలు ఉత్తమ శ్రేణికి రాజాలవు. అవి అహంభావ దోష దూషితములు కాగలవు. ప్రస్తుతం ప్రపంచం సాగిపోతున్న గతి ధోరణుల దృష్ట్యా ప్రస్తుతకాలపు సాహిత్యం, జీవితంపై నానాటికి ఎక్కువగా కానవస్తున్న విజ్ఞాన సాంకేతిక శాస్త్రాల అభివృద్ధి ప్రభావాన్ని ప్రతిబింబించటం అత్యంత సముచితంకాగలదు.

ఏదైనా ఒక భాష అభివృద్ధి చెందితే అది తక్కిన భాషల అభివృద్ధికికూడా దోహదకరమౌతుంది. కనుక వివిధ భాషలమధ్య సామరస్యాన్ని పెంపొందింపచేయాలి. అయితే

భాషా విషయకమైన వాదోపవాదాలు రాజకీయ రంగంలో ఉన్నంత తీవ్రంగా సాహిత్యరంగంలో కానరానటము లేదు.

— పండిత శ్రీ జవహరలాల్ నెహ్రూ.

సాహిత్యవేత్తలు ఫలానా విషయమే వ్రాయాలని సాహిత్యానికి నేనెప్పుడూ హద్దులు కల్పించను. ఇదేమాటను ఒకసారికాదు. అనేకసార్లు చెప్పాను. సాహితీపరుడేదివ్రాసినా "ఇది నాకోసమే వ్రాశాడేమో" నని ఎవరికివారు భ్రమించేటట్లుగా వ్రాయాలనే నా వాంఛ. అప్పుడే అది ఉత్తమ సాహిత్యమనిపించుకుంటుంది. ఎవరికో కొందరికి మాత్రం ఉపయోగపడే సాహిత్యం అప్రధానంగా భావించబడుతుంది. ఆ సాహిత్యానికి అసలు ఆత్మయే ఉండదనికూడా అనకతప్పదు. సూర్యభగవానుడు ఉదయించినపుడు సర్వప్రాణులు సమాన రూపంలోనే ఉపకారాన్ని పొందుతాయి. పక్షులు మాకోసమే ఉదయించాడేమోనన్నట్లు కలకలారావంలో లీనమైపోతాయి. మానవులు మాకోసమేనని తలపోస్తూ తమ తమ కార్యకలాపాల్లో మగ్నమైపోతారు. గోరక్షకులు మేము పచ్చిక బయళ్ళకు వెళ్ళటానికే ఉదయించాడని చద్దిమూటలకుత్వరపడుతూ ఉంటారు. ఇలాగే ఉత్తమ సాహిత్యం అందరికీ అనేక విధాల ప్రేరణను కలిగించేదిగా ఉండాలి. దేశకాల వ్యక్తి పాత్రలతో నిమిత్తం లేకుండా అది సర్వులనూ చైతన్యవిలసితం చేసేదిగా రూపొందాలి. —ఆచార్య శ్రీ వినోబా భావే.

## "కవి"

కవి జాతికి వైతాళికుడు. కవిత్వం జాతికి మేల్కొలుపు. కవి నిద్రాణమయిన సమాజాన్ని ప్రబుద్ధంచేసి, అభ్యుదయ మార్గంలో ముందుకు నడిపిస్తాడు. నీరసమై, నిర్వీర్యమైన సమాజం రక్తనాళాల్లో నవస్ఫూర్తిని పొంగించి, కవోష్ణ రక్తాన్ని ప్రవహింపచేస్తాడు. కనుకనే కవికీ సమాజానికి అవినాభావసంబంధం ఉంది. కవిలేనిదే, సమాజానికి అస్తిత్వం, లేదు. సమాజం లేనిదే కవికి వ్యక్తిత్వంలేదు.

— జానపవాకవి - సన్మాన సంఘం.

సమాజవికాసము కల్గించువారిలో కవియొకడు. అంతే కాదు ప్రముఖుఁడుకూడ. అతఁడు ద్రష్ట. అతని చూపు విశ్వవ్యాపకము. అతని సృష్టి సత్యము, శివము, సుందరము. అతడు నిద్రాణమైయున్న జాతిని మేలుకొల్పు వైతాళికుడు. అతనివాణి ప్రజానీకమును ఉన్నతోన్నతశిఖరముల కెక్కించు నిశ్రేణి. అతడు లేని సంఘము నిర్జీవము. అతని నారాధింపని జాతి నిస్తేజము. సంఘము ఉత్తమ మార్గములో పయనించి, విశ్వకళ్యాణకారియగునట్లు తోడ్పడవలసిన బాధ్యత, అధికారము కవులకు హెచ్చుగాగలదు. అట్టివారిని గుర్తించి, గౌరవించి వారి సందేశమును శిరసావహించి ఓజస్సు, తేజస్సు సమార్జించుకొనుట సంఘమున కవశ్య కర్తవ్యము.

ఆంధ్రసారస్వతనికుంజమున నేను కొంగ్రొత్త కుసుమ
మంజరులు పొడసూపుచుండుట రసికులకు ఆంధ్రభాషాకోవిదు
లకు తెలియనిదికాదు. "వందేమాతరమ్" ఉద్యమముతోనే
జాతీయగీతములు దేశమునలముకొన్నవి. "సుజలాం, సుఫలాం
మలయజ శీతలాం" అనే గీతా[illegible]యుద్యమముల తరువాతనే
ఆబాలగోపాలము నేర్చుకొనినారు. జాతీయగీతాలతోపాటు,
దేశనాయక ప్రశంస, కాంగ్రెసు, సత్యాగ్రహోద్యమాలను
గూర్చి పద్యాలువ్రాసి కవులు వి[illegible]తారు. ఇట్టి యుద్యమాల
తోనే రాష్ట్రోద్యమ సమస్యలుకూడాపుట్టి దేశమును రేకెత్తించి
నవి.

— ఆంధ్రపత్రిక [illegible] సంచిక.

ఆనాటి దేశభక్తి పరప్రభుత్వమును పారద్రోలుటకు—
ఈనాటి దేశభక్తి దేశమును భాగ్యవంతి మొనర్చుటకు
ఆనాడు త్యాగగీతము నాలాపించిన కవి కుమారుడు—ఈనాడు
సంఘీభావ గేయమును పాడవలదా? ఆనాడు అసహాయ
యోగమును ప్రచారమొనర్చిన రచయిత—ఈనాడు సహకార
సిద్ధాంతమును ప్రబోధమొనర్ప వలదా? ఆనాడు బ్రిటిషు
సామ్రాజ్యవాదమును దూయబట్టిన ఉపన్యాసకారుడు—ఈనాడు
భారతజాతీయ భావమును పురికొల్పవలదా? ఇంతయేల?
తమ కలములచే భావవిప్లవమును రేకెత్తించగల కవిరాజులు

రచనాధురీణులు, తమ వాగ్ధోరణితో జగముల నుఱ్ఱూతలూగింపగల ఉపన్యాసవేత్తలు మనకు వేలాదిగా కావలసియున్నారు.

— శ్రీ భగవంతరావు సన్మాన సంచిక.

విశాలాంధ్రావని యందు పురాణయుగమునుండి ప్రస్తుతపు ఆధునికయుగము వరకు మహామహులైన కవిపండితులుదయించి, దేశభాషా సంస్కృతిని విస్తరింపచేసి, విశ్వ విజ్ఞాన చైతన్యమును గగనవీధుల నంటించి దేశమునకు జ్ఞానచక్షువులైనారు, పండితకవుల కలము, కంఠారవములులేని దేశము కీకారణ్యము. కవితా సుధారస వృష్టివలనగాని జ్ఞానసంపదలు వర్ధిల్ల నేరవు. జ్ఞానసంపదలులేనియెడల, దేశమజ్ఞాన తిమిరాంధ బంధములచిక్కి కృశించి నశించుట నిక్కువము.

— శ్రీ వేదాంతకవి సన్మాన సంచిక.

# గ్రంథపఠనము

చదువు పెరుగుతున్నది; చదువు తగ్గుతున్నది. పరస్పర వైరుధ్య మున్నట్టు తోస్తున్న ఈ వాక్యంలో నిజానికి అట్టిదేదీ లేదు. "చదువు" అనే పదానికి "శబ్దార్థ చంద్రిక" క్రియగా "పఠించు" అని, విశేష్యంగా "పఠనము. విద్య" అని అర్థాలను వ్రాస్తున్నది. విశేష్యంగా "చదువు" పదానికున్న రెండు

అర్థాలను దృష్టిలో పెట్టుకుంటే, ప్రస్తుతం చదువు పెరగడంతో పాటు, అది తగ్గిపోతున్నదని ఎవరైనా అంగీకరించక తప్పదు. చదువు నేర్చినవారి సంఖ్య నిస్సంశయంగా పెరుగుతున్నది. కాని, ఇందుకు అనుగుణంగా పుస్తక పఠనంపట్ల ఆసక్తిచూపే వారి సంఖ్య పెరగడంలేదు. విద్యావంతులైనవారిలో గ్రంథ పఠనాసక్తిగలవారి శాతం (పర్సంటేజ్) ఇప్పుడున్నంత తక్కువగా మునుపెన్నడు లేదేమో!

చదువు తక్కువైన రోజులలో తామై చదువుకోలేని వారు ఇతరులు చదువుతుండగా వినడానికి చెవులు కోసుకునే వారు. పురాణాది కాలక్షేపాలవద్ద ఇట్టివారు వేనవేలు కన బడుతుండేవారు. చదువు పెరిగిన ఈ రోజులలో చదువుకున్న వారిలో హెచ్చుమంది బడిని విడిచిపెట్టిన తర్వాత తిరిగి పుస్తకం చేతబట్టిన పాపాన అంతగా పోవడంలేదు సరిగదా, చదువు రానివారిలో ఇతరులు చదువుతుండగా వినాలన్న ఆసక్తి ఇదివరలోవలె హెచ్చుగా కానరావడంలేదు.

పుస్తకాలను చదువుతున్నవారిలో సయితం పెక్కు మంది ఉబుసుపోకకు పనికివచ్చే వాటిపట్లనే మోజు చూపు తున్నారుతప్ప, మెదడుకు పని పెట్టగలవాటి ఛాయలకైనా పోవడంలేదు. రైలులో కూర్చున్న కాసేపూ రంజింపజేయగలి గిందే రసవత్తరమైన రచన; బస్సు ప్రయాణం బాధను మర పింపజేయగలిగిందే బహుళ ప్రచారం పొందగల గ్రంథరాజం.

ఇందువల్లనే ప్రణయకథను లభిస్తున్న పరిజాదరణలో పదవ వంతుకైనా పద్యకావ్యం నోచుకోనడంలేదు; అపరాధ పరిశోధక నవలల అమ్మకంలో అరవయ్యో వంతుకూడా అన్యవిధమైన రచనలకు ఉండడంలేదు.

మొత్తంపై విజ్ఞానం కంటె వినోదానికే ప్రస్తుతం ప్రాధాన్యమివ్వబడుచున్నది. కనుకనే విజ్ఞానపరమైన గ్రంథాలకు మారుగా వినోదకరమైనవి ఆదరించబడుతున్నాయి. కేవలం మన దేశంలోనేకాక, ఇతర దేశాలలోకూడా తరతమ భేదాలతో ఈ దుష్పరిణామం గోచరిస్తున్నది. దీని ఫలితంగా ఆధునిక యుగంలో ఆలోచనే తక్కువైపోతున్నది. ప్రపంచం మొత్తంమీదనే జ్ఞానతృష్ణ ఈనాడు నమసి పోయినదనడం సత్యదూరంకాగలదు గాని, ఈ తృష్ణ చాలావరకు ప్రకృతి శాస్త్రాలకే పరిమితం. అణుగర్భంలోని రహస్యాలను పెకలించడానికి ఆతురత విశేషంగానే చూపబడుచున్నది. ఆత్మస్వరూపం తెలుసుకోనవలెనన్న ఆకాంక్షే తక్కువ.

మరొక విషయం. ప్రకృతి శాస్త్రాలపట్ల శ్రద్ధాసక్తులు గలవారు కొద్దిమంది వైజ్ఞానిక వేత్తలు మాత్రమే కాగా, ప్రపంచ ప్రజా బాహుళ్యంలో అసలు ఏవిధమైన జ్ఞాన తృష్ణ అంతగా లేకుండా పోతున్నది. నిత్య జీవితావసర వస్తువులను యంత్రాలు సులువుగా 'మెకానికల్'గా చేసి పెడుతున్నట్టే మెదడుకు కావలసిన మేతను కూడా తామేమీ శ్రమపడ నవ

సరంలేకుండా ఎవరైనా గుళికల రూపంలో అందించితే పుచ్చు కోవాలన్న కాంక్షే జ్ఞానతృష్ణ అయితే మాత్రం, అది ప్రస్తుతం విస్తారంగానే వున్నదని చెప్పవచ్చు!

విద్య పెరుగుతున్నా, వైజ్ఞానిక శాస్త్రాలు పెరుగుతున్నా ప్రపంచంలో విజ్ఞత పెరగక పోవడానికి కారణం.—స్వయంగా ఆలోచన చేసుకునేశక్తి క్షీణించిపోవడమే. ఈ లోపం తీరితేనే తప్ప తనను యెదుర్కొంటున్న మహా సమస్యలను ఆధునిక ప్రపంచం సవ్యంగా పరిష్కరించుకోననూ లేదు; ప్రగతిని సాధించనూ లేదు.

ఆలోచనా శక్తికి పోదిచేయగలిగింది ఉత్తమ గ్రంథ పఠనం మాత్రమే!

ఆంధ్రప్రభ 1955 అక్టోబర్ 7.

"ఆధునిక మానవునకు మెదడు తక్కువైపోతున్నది. ప్రకృతిపై ఆధిపత్య సాధన సందర్భంగా విజ్ఞాన శాస్త్రాలలో, సాంకేతిక శాస్త్రాలలో విపరీతంగా అభివృద్ధిని సాధించిన మానవుడు బుద్ధి కుశలతలో, బహుశా నైతికబలంలో తత్తుల్యమైన వికాసాన్ని కాంచలేక పోతున్నాడనే విషయం ఎవరికైనా ఆందోళన కలిగించక మానదు" — నెహ్రూ.

"ప్రతి ఒకడు తన శాంతి సుఖములకుగాని, తన దుఃఖములకుగాని కావలసిన బీజములను తన లోపలనే పెట్టుకొని బ్రతుకుచుండును. మన ధ్యేయాకాశమునకు, చాల వరకు మన యాత్మ స్వరూపము ననుసరించియే రంగు వచ్చుచుండును. మనము వినెడి సంగీతము మన అభిరుచిని బట్టియే యింపగుచుండును."

నేటి యుగములో రాజకీయములను తాత్త్విక దృష్టితో సత్యాహింసల మార్గమున పయనింపజేసి ప్రపంచేతిహాసమున భారత జాతికి సముచిత స్థానమును సంపాదించిన అవతార మూర్తి జాతిపిత గాంధీజీ. ఆ మహామహుని అడుగుజాడలలో పయనించినంతవరకే భారత చరిత్ర జగజ్జేగీయమానమై ప్రకాశింపగలదు. భౌతిక వాదములకు కట్టుపడిన పాశ్చాత్య దేశములు భారతీయుల పారమార్థిక పరిజాభ్యుదయ పరిశాలిక లముందు మోకరిల్లుచున్నవి. అటంశక్తిని కనిపెట్టినను, ఆత్మ శక్తికి లొంగినవి. సామ్రాజ్యముల నిర్మించినను సమతాధర్మమునకు దూరమైనవి. ఆయుధముల పెంచుకొన్నను ఆదరణను కోల్పోయినవి. కనుకనే యావత్ప్రపంచము యుద్ధోన్మాద సంక్షోభమున చిక్కువడి శాంతి సందేశమునకై భారత దేశము వంకచూచుచున్నది. మన ప్రియతమ నాయకుడు జవహర్ లాల్ పండితుని దివ్యవాణికి దివ్యత్వమును, భారతేతిహాసమునకు యశోవిశాలత్వమును, మానవజాతి చరిత్రకు జ్ఞానతత్త్వమును సమకూర్చి శాంతిని ప్రబోధింపవలసిన మహత్తర కార్యక్రమము నేటి కవులది, గాయకులదే.

— శ్రీ "అభినవ పతంజలి" సన్మాన సంచిక.



శ్రీ సర్వోదయ ప్రెస్, చిలకలూరిపేట.

## శ్రీ జాస్తి వేంకటనరసయ్య ప్రచురణలు:

ఖండకృతి : (సాంఘిక కార్మిక సమతా బోధక పద్యకావ్యము) 1-25

వ్యాసవాణి: (వ్యాససంపుటి - అపూర్వరచన. అవశ్యపాఠ్యము) 0-37

నవగీతాలు: (జాతీయ గేయములు - కంఠస్థము చేయదగినవి) 0-25

వయోజన విద్య: (పెద్దలవిద్యను తద్దయు తోడ్పడు రచన) 0-25

కవిత : (ప్రసిద్ధాంధ్రకవి పద్యగేయ రత్నములు, సంపాదన) 0-50

ఆంధ్ర సేవకులు : ఉత్తమాదర్శ విశిష్టరచన- మాతృభూసేవచే
మాన్యులగు ఆంధ్రుల జీవితాలు- ఉపవాచకం మొదటిభాగం 0-50

" " రెండవ భాగం 0-50

ఉత్తమ కథలు: (సారస్వతోపాసకుల జీవితగాథలు) 0-75

వ్యాసవాణి : (వివిధ వ్యాసములు, రెండవభాగము) 1-00

ఉపన్యాసమాల: (ముద్రణలో) 1.25

గాంధీమహాత్ముడు :(జీవిత చిత్రణము- అచ్చులో) 1-00

విద్వాన్ శ్రీ ధూళిపాళ వేంకటసుబ్రహ్మణ్యంగారితో కలసివ్రాసినరచనలు

కాంగ్రెసువిజయము: (60 సం॥ చరిత్రాత్మక నాటకము) 1-00

ప్రజారాజ్యం:
(సామ్యవాదనాటకము, బహుప్రదేశప్రదర్శితము)
ఉపాధ్యాయుడు-ఏకపాత్ర నాటిక-ప్రదర్శనయోగ్యం } 1-00

చలోఢిల్లీ: (సుభాసుచంద్రబోసు చరిత్ర - బుర్రకథ) 0-75

జయభేరి : (జాతీయములగు ఖండకృతుల సంపుటి) 1-25

వైతాళికకథలు: [జాతీయనాయకుల జీవిత చరిత్రలు] 0-75

జాతీయ కథలు: " " 0.75

ఆచార్యరంగా: (జీవిత చరిత్ర) 0.75

జాతీయ దసరా గీతములు: 0.13

ప్రతులకు:- జాస్తి వేంకటనరసయ్య, ఉభయభాషా ప్రవీణ,

చిలకలూరిపేట :: గుంటూరుజిల్లా.